# వజ్రహారము

అను

గయ్యాళిగంప.

గ్రంథకర్త:

యస్. సూర్యనారాయణమూర్తి, బి. ఏ.



ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్య,

శ్రీసత్యనారాయణబుక్ డిపో,

రాజమండ్రి.

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణి

(తాత్పర్యసహితము)

సోదరా!

రసమయాత్మకములు, కావ్యములు. రసములు తొమ్మిది. వానికి శృంగారరసము నాయకమణి. దానిమూర్తిత్వమే కృష్ణరూపము. ఆప్రభులీలలు వర్ణించినకవులు చాలతక్కువ. ఈగ్రంథమునందు గ్రంథకర్త భక్తులకు శ్రీకృష్ణజననము, బాల్యచేష్టలు, శైశవక్రీడలు, కాళీయమర్దనము, గోపికావస్త్రాపహరణము, గోవర్ధనోద్ధరణము, గోపికలకు జ్ఞానోపదేశంబుచేయుట, రాసక్రీడలు, రాధాకృష్ణసంవాదము, గోపికాగీతలు, కంసవధ, భ్రమరగీతలు, రుక్మిణీకళ్యాణము, కృష్ణుడు జాంబవతి మొదలగు నష్టభార్యలను పెండ్లాడుట కన్నులకు గట్టినట్లు వర్ణించినాడు. నీ వెన్నిపాపంబులు చేసినను తొలంపయత్నించు నుపాయము వెదుక వను మాటకల్ల. కృష్ణనామస్మరణము ముక్తిదాయకమని నీస్నేహితులకు నచ్చచెప్పదలంచితివేని కృష్ణలీలాతరంగిణిని చూపుము.

వెల 0—12—0

దొరకువారు:—

శ్రీసత్యనారాయణబుక్కు డిపో,

బుక్సెల్లర్సు అండ్ పబ్లిషర్సు,

రాజమండ్రి.

# గయ్యాళిగంప.



(మనోహరమగు సాంఘిక నవల.

గ్రంథకర్త:

యస్. సూర్యనారాయణమూర్తి.

మొదటికూర్పు 2000 ప్రతులు.

పబ్లిషర్:

కొండపల్లి వీరవెంకయ్య,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

1936.



[వెల రు 1-0-0

ఓమ్

శ్రీరామా.

# గయ్యాళిగంప.

## మొదటి ప్రకరణము.

### ప్రొద్దుట పెండ్లి!

—

"అగును—ఆలాగుననే........తప్పకవచ్చెదను.........
......గోహార్! చెప్పలేను.....ఆసంగతి చెప్పలేను.......తప్పక వచ్చెదను......గుడ్ నైట్"...అని టెలిఫోనులో చెప్పి, ఖుదీరామ్ మెహతా, రిసీవరును గ్రింద బడవైచి—మేజాబల్లమీద నున్న తేనీటి గ్లాసును సమీపించెను.

ఆతఁడామెను ప్రేమింపలేదు. అంతవరకాతడెరుగును; ఆకారణముచేతనే వానిలో వ్యాకులముదయించినది. ఏమయినను, రేవుఉదయమాలయము లోనికి పెండ్లివేళకు వెళ్ళకతప్పదుకదా! కంఠమునకురిత్రాడు వచ్చినను, పెండ్లిమానరాదు. పెండ్లినిగురించి వానికివిచారములేదు.

అదేలోపము! గొప్పతప్పు!

ఖుదీరామ్మెహతా ఒకగ్లాసు తేనీటినిముగించినాడు. మరలఫ్లాస్కులోనున్న తేనీటిని గ్లాసులోపోసికొని త్రాగినాడు. పిమ్మట ఆగదికి మధ్యభాగముననున్న కుషాణ్ ఛెయిర్ మీద గూరుచున్నాడు ఆతఁ తానిప్పుడు సందిగ్ధావస్థలో నుంటినని తలంచెను.

ఆతడు మిస్. గోహారును ప్రేమింపలేదు "స్మాల్ ప్లేగ్రౌండు" లో నాటలాడుకొను సమయమందు, తనకాప్రిపును వెనుకనుండివచ్చి,

ఆమె ముడివెట్టినప్పటినుండియు, నాతనికామెయందు గౌరవమున్నది. ఆగౌరవ మిట్టిదనిగాని— ఇంతయున్నదనిగాని—ఆతడు చెప్పలేడు. ఆయిరువురు వధూవరులగుదురని చిన్నతనమునుండియు నిరుగుపొరుగు వారిచేతపరిహసింపబడుచున్నను-కానున్న పెండ్లిమాత్రము,ఖుదీరామున కాశ్చర్యమును గలుగజేయలేదు. అది యిష్టములేనిపెండ్లియే! తప్పని సరిపెండ్లియే! అయినను, వానికి విచారముగాని, భయముగాని, ఆత్రముగాని కలుగుచుండుటలేదు. ఆతడారాత్రి—నిద్దుర వచ్చువరకును బ్రయత్నించును. ఉదయమున సరిగా, పెండ్లివేళకాతడాలయములో నుండగలడు. ఆలస్యముచేయడు. అందులకు రెండుకారణములున్నవి. ఒకటి సతార్—సేవకుడు! రెండు—"అలారమ్‌కాల్!" సతార్ ప్రతి నిత్యము నుదయమారుగంటలకు తప్పక నిద్రనుండి మేల్కాంచును. తోడనే, తనయజమానుని మేల్కొలుపును.

కాని—ఆతనియెడల, పెండ్లి గొప్పతప్పని మాపాఠకులుగ్రహింపవలయును.

అగును—తప్పే! గొప్పలోపమే! అందులకు సందేహము లేదు. యువకులందరును బెండ్లికిచ్చగింపవలయుననియు—జీవితమధ్యములోనే దోయొక కన్యను భార్యగాచేపట్టవలయుననియు— ఆకారణముచేతనే తానును బెండ్లాడుచున్నాననియు ఖుదీరామ్ మెహతా భావించుచున్నాడు. పెండ్లికి సన్నాహములన్నియు ముగిసినవి ఇకనదితప్పదు—జరిగితీరవలసినదే! గోహారునకును ఖుదీరామునకును పెండ్లి నిశ్చయింపబడుటకొక ప్రబలకారణమున్నది.వారి తండ్రులిరువురును స్నేహితులు. ఇరువురును 'అలాస్కాద్వీపము'నకు బోయి, కలసిమెలసివర్తకముచేసి — ఒకరికష్టసుఖములలో నింకొకరు పాల్గొని, ధనమార్జించిరి.

ఆకారణమే నేడు ఖుదీగోహారుల పెండ్లిని నిశ్చయించినది. తండ్రులకు గలవర్తక సంబంధమగు స్నేహమే— పిల్లలపెండ్లిరూపమునుదాల్చినది.........

ఖుదీరామ్—ఒకనిట్టూర్పు బుచ్చెను. ఆతనిహృదయములో జుగుప్సా భావములేదు. ఆతడు కుషానుఛెయిర్‌లో గూరుచుండి-కానున్న కార్యములు కాకమానవను శుష్కవేదాంతధోరణి నవలంబించుచుండెను.

ఆతడు—ఉదయమును గురించి, తలంచుటలేదు—రానున్న దినములను గురించికాని—కానున్న విషయములను గురించికాని తలచుట అనవసరమని వానిభావము.

ఆతనికి పెండ్లి తప్పనిసరియయ్యు, నంతగా భయోద్రేకములను గలిగించుటలేదు. తప్పనిసరిగా తనతండ్రి చేసిన వర్తకమును దానిప్పుడు చేయుచున్నటులనే— రేపుప్రొద్దుట గోహారును పెండ్లాడవచ్చునని ఆతడనుకొనెను.

కానియింకను—పెండ్లికిఈరాత్రివ్యవధియున్నదికదా! 'రేపు' అనుమాటను ఖుదీరామ్‌లెక్కచేయడు. ఈసమయమందాతడింకను బ్రహ్మచారియే—స్వతంత్రుడే! స్వేచ్ఛానుసారము సంచరించుటకు హక్కు వానికిప్పుడున్నది. కాని యిప్పుడు చేయవలసినదేమి?

ఖుదీరామ్—తనచేతినిమీదికెత్తి—రిష్టువాచీపై దృక్కులను ప్రసరింపజేసెను. ఏడుగంటల ముప్పదినిముషములయినది—ఆతడింతవఱకు భోజనముచేయలేదు. సరికదా, ఈక్షణమువఱకు, భోజనమును గూర్చిన తలంపేవానికి కలుగలేదు గోహారుతో టెలిఫోనులో మాటలాడుచు నాతడు కడుపుసొదను మరచిపోయినాడు. కాని యిప్పుడాకలి యగుచున్నట్లు—ఆతడుగ్రహించెను.

ఆతడు "కాలింగ్ బెల్" మీదకు తనచేతినిబోనిచ్చెను. సతార్ వచ్చుటతోడనే—భోజనమును హొటలువానిద్వారా మేడమీదికి తనగదిలోనికి తెప్పించుకొందునాయని ఆతడాలోచించెను. కాని ఆతడదులకిష్టపడలేదు. రేపటినుండి అట్లుచేయకతప్పదు. ఈ

రాత్రికూడ నట్లుచేయుచుందురా? ఆతఁడేక్లబ్బునకయిన వెళ్ళినయెడల-గానమువినవచ్చును—పడుచుకన్నియలను జూడవచ్చును—స్వేచ్ఛగా నా యొక్క రాత్రియయి నవెళ్ళబుచ్చవచ్చును— అనుకొనెను.

అంతలో సతార్—తలుపు తెరచుకొని, లోనప్రవేశించి నాఁడు—ఆతఁడు గారడీవానిబోలినాడు. ఎప్పువేళలయందును, దన యజమానుని ముఖమునుజూచినంతమాత్రాన--వానికేమికావలయునో ఆతఁడు గ్రహింపఁగలఁడు. సతార్—ఖుదీరాముని ముఖలక్షణముల నించుకసేపు పరికించెను, పిమ్మట సవినయముగావంగి నిలువఁబడి—

“అయ్యా! భోజనమునకు బయలుదేరనుంటిరా?” అని ప్రశ్నించెను. ఖుదీరామ్ చిరునవ్వునవ్వెను. ఆతఁడు—తనయంగీబొత్తములను సవరించుకొనుచు—

“అగును—నేనిప్పుడు మరచిపోయితిని, భోజనమునకే బయలుదేరుచున్నాను. సతార్! నాదుస్తులను దెచ్చిపెట్టుము.”

సతారు దుస్తులనుతీసికొనివచ్చి, యజమానునికిచ్చెను. ఆతఁడు వానినిపుచ్చుకొని, ధరించి—పిమ్మట నొక “విక్టోరియా”ను అద్దెకు మాటాడుకొని అందులోప్రవేశించి కూరుచుండెను.

“ఎక్కడకుబాబూ?” అని బండివాఁడుప్రశ్నించినప్పుడే ఖుదీరామునకు తెలివివచ్చినది.

“ఎక్కడకా?.........ఓహో !.........సరే......హోటలునకు......అనుమాటల నాతఁడతికష్టముమీఁద నుచ్చరించెను.

“మోడరన్ హోటలా? సివిల్ రెస్టారెంటా? బాబూ!” అని బండివాఁడు మరలనడిగినాఁడు.

ఖుదీరామ్—తిరిగి గాఢాలోచన మభినయించెను. అందకత్తెలగు స్త్రీలును—మనోహరములగు నాహారపదార్థములును — ఏహోటలులోనో యుండునని ఆతఁడొకప్పుడు—తనస్నేహితుఁడు చెప్పగావిని

యుండెను కాని, సమయమునకా హొటలుపేరు జ్ఞప్తికివచ్చుటలేదు. ... .....అది......హాయిశః......గవర్నర్ స్క్వేరులో నెక్కడో యున్నది.........దానిపేరు?......

ఆతనికా హొటలుపేరు జ్ఞప్తికివచ్చినది, చిరునవ్వుతో నాతడు బంగీవానిం దిలకించెను.

"క్యావలెట్! నీవెరుఁగుదువా?"

బండివాడు—తలయూచినాడు— వడిగావిక్టోరియాసాగి పోవు చున్నది. ఖుదీరామ్ కుషానుల నానుకొని కూరుచుండి, అంగిజేబులోని సిగరెట్టును బయటకుదీసి, నోట బెట్టుకుని, ముట్టించెను. ఇంతకు, భోజనమిప్పుడు తన కవసరమా అన్న సందేహము వానికుదయించినది. కావలయును—ఈరాత్రి గడచినయెడల రేపటినుండియు—గోహారుతో కలసి భుజించుట తప్పదు. కనుక నొంటరిగా నీరాత్రితాను భుజింపవలయును- అని ఆతఁడు నిశ్చయించుకొనెను.

ఆతనికి నిద్రబద్ధకము కూడ వచ్చుచున్నది—ఏమిచేయుటకును తోచనివానివలె నాతఁడు—'ల్యాంపు-పోస్టు'లను లెక్క పెట్టుచుండెను. ఆతఁడు ముప్పది యెనిమిదవ 'ల్యాంపు-పోస్టు'కడ నాకస్మికముగాకన్నులనుమూసికొనెను- "రేపు—ఉదయము—పెండ్లికై గోహారునకును దనకును గావలసిన టిక్కెట్లు పుస్తకముల నెక్కడ పెట్టితినా"? అని ఆలోచింపమొదలిడెను. అలగూరాధిపతి సరిగా ఎన్నిగంటలకు—వివాహపుటుంగరములను పుచ్చుకొనుటకు వచ్చునన్న ప్రశ్నమరల వాని మెదడులో ప్రవేశించినది.

దిక్కుమాలినగోల! ఆతఁడుంగరమునుపుచ్చుకొనుట మరచిపోయినాఁడు.........ఒకవేళ...సతార్......"ఆగును." అనిపలికి, ఆతఁడొకనిట్టూర్పుఁబుచ్చెను. సతార్ మరచిపోలేదు—ఆతఁడు తన

యజమాని తెచ్చిన వివాహపుటుంగరము — పెట్టెలో పెట్టి- ఆ పెట్టెను మేడమీదిగదిలో మేజాబల్లమీఁద పదిలపఱచెను.

ఆహా! సతారెంతమంచివాఁడు "తనకొఱకును — గోహారుకొఱకును పుచ్చుకొన్న బొంబాయియందలి డారింగటన్ స్ట్రీటులోని ఆమేడలో, సతారు నౌకరుగా నెందులకు కుదురవలయును? ఆతఁడుమాత్ర మెందులకు పెండ్లాడరాదు?" — అని ఖుదీరామ్ మొహాతా ఆలోచింపసాఁగెను. వానిదృష్టిలో ప్రస్తుతము పెండ్లియనఁగా అంత చులకనగా నున్నది!

'ప్రేమ' యను రెండక్షరముల నాతఁడింతవఱకు విని యుండలేదు ప్రేమించుట వానికెట్లో తెలియదు. ఆతఁడే యువతిని గురించియు, హృదయములో నుద్రేకమనుభవించి యెఱుఁగఁడు. ఏమయినను, మోహాతిరేకముతో — హృదయాంతర్భాగమునుండి పొంగిపొరలుచున్న కామమును దృప్తిపరచుకొనుటకును- దేహములోని వెచ్చనెత్తురు ముచ్చెమటలను గలుగఁజేయు, నిట్టూర్పుఁ బుచ్చుటకును — తమితీఱ బాహుద్వయములోనదిమి — అనుభవించుటకును. ఆతఁడింక వేరొక అందకత్తెనుగనుఁగొనలేఁడు.

తెల్లవారినయెడల గోహారును దాను పెండ్లాడనున్నాఁడు. ఆమె అందమయినది- ఆమెకుద్రేకములేదు. నాగరకతగలదు.

విక్టోరియా ఆఁగినది. ఖుదీరామ్ మొహతా క్రిందనుదిగి బండివానికి బాడుగనిచ్చి-అద్దపుతలుపును లోనికిఁదోసి, వడిగా లోనఁబ్రవేశించెను.... ..

ఏమో! వానిప్రారబ్ధ మెట్లున్నదో!

# రెండవ ప్రకరణము.

---

బొంబాయినగరములో పేరొందిన రిష్టారెంటులలో—"క్యావలెట్" ఒకటి-ఆహోటలు చూచుటకందముగ నుండుట మాత్రమేకాక, ప్రశాంతముగనుండును- గందరగోళమందెక్కువగా నుండదు.

ఉత్తరీయమయిన లేకుండ— నిలువుటంగీ-కట్టుకొన్నపంచి— కాళ్ళకు-స్లిప్పర్సు-వీనితో-ఖుదీరామ్ మెహతా, క్యావలెట్ హోటలులో ప్రవేశించినాడు. ఆతడు దానినింతకుపూర్వము చూడలేదు. ఇక ముందుకూడ చూడరాదనియే నిశ్చయించుకొన్నాడు. హాలులో నల్వంకల పరిశీలించుచు నాతడు నిలువబడుసరికి—సద్దుచేయకుండ వెయిటరొకడువచ్చి, వానియెదుట ప్రత్యక్షమాయెను.

"ఖాళీబల్ల లనేకములున్నవి— తమరాగదిలో నేప్రక్కకూరుచుండుదురో నేనడుగవచ్చునా?"అని ఆతడు ఖుదీరాముని, సవినయముగా ప్రశ్నించెను.

ఖుదీరామ్ ఒకపరి మందహాసము నుగావించెను-ఆతనిదృక్కులు "ఆర్కెష్ట్రా" యున్నప్రాంతమునకు పరుగిడుచున్నవి.

"ఉండుము—నేనాలోచించిచెప్పెదను"అని కటువుగానాతడు వెయిటరునకు బదులుచెప్పెను. పిమ్మట తనదృష్టిని—ఆయువతిమీదికి ప్రసరింపజేసినాడు. క్షణకాలమువరకు వానినోటినుండి మాట వెలువడలేదు.

ఆయువతి—ఆర్కెష్ట్రాకు దగ్గర నొంటరిగా కూరుచున్నది. ఆమెకు వర్ణనాతీతమగు సౌందర్యములేను-—ఆమెధరించిన దుస్తులు అమూల్యములుగావు—అట్లయ్యు నామెలో ఆకర్షణశక్తి ప్రకటితమగుచున్నది—ఆమె ధరించినచీర అందముగనున్నది. ఆమె మిక్కిలిపొడవు

గనున్నది—శరీరచ్ఛాయ నల్లగనేయున్నది. కురులు దీర్ఘముగా పెరిగియున్నవి—ముంగురులు ముసుఁగులోనుండి, బయటకు తొంగిచూచుచున్నవి.

మొత్తముమీఁద నామెలావణ్యరాశి! జరీఅంచుగల ఎఱ్ఱనిచీరలో నామెతనువుచాయ మనోహరముగఁ గన్పట్టుచున్నది-స్లిప్పర్సులోనున్న పాదములు మృదువులని వేరుగచెప్పనక్కఱలేదు. ఆమెతొడుగుకొన్నజాకెట్టు—ఆమెకొక వింతసోయగమును గలిగించుచున్నది- ఆమెచేతులు పండుతమలపాకులవలె లేతున్నను-నల్లగానున్నను, అవితామరతూడుల ననుకరించుచున్నవనుట అతిశయోక్తి కాదు—శ్రీకారములఁబోలిన చెవులనుండి చక్కనిరాళ్ళు పొదుగఁబడిన ఆభరణములు వ్రేలాడుచున్నవి. ఆమె కితరములగు నాభరణములులేవు—వ్రేలికుంగరములేదు.

ఆర్ఛెష్ట్రాను తదేక ధ్యానముతో నామెవినుచున్నది బాహ్యలోకమును పూర్తిగా మరచియున్నదేమో!హాలులో నిలుచఁబడియున్న ఖుదీరాముని—ముప్పది సెకండ్లనుండియు-నోటమాటలేక-రెప్పవాల్చక—తదేకదీక్షతో తనవైపు దృక్కులను ప్రసరించుచున్న ఖుదీరాముని ఆమెచూడనేలేదు—ఆతనిరాక నామెగురితింపనేలేదు.

వెయిటరు మరల ఖుదీరాము నుద్దేశించి ప్రశ్నించినాఁడు—

“అయ్యా! ఏబల్ల? ఆర్ఛెష్ట్రాదగ్గర?”

ఖుదీరామ్ ఉలికిపడెను.

“కాదు—సాధ్యమైనంతవర కామెదగ్గరగానున్న బల్ల......” అని చెప్పుచు నాతఁడు వెయిటరువెంట నడచెను. వెయిటరా పెద్దమనుష్యుని—ఆయువతికి ప్రక్కనేయున్న బల్లయొద్దకుఁగొనిపోయి, కూరుచుండఁజేసెను.

ఆసమయమునఁ గూడ నామె గానములోనే లీనమైయున్నది. తనకు ప్రక్కగా సమీపమందున్న బల్లయొద్ద, కుర్చీని బయటకు లాగి కూరుచుండి, ఉత్సాహముతో తన్నుఁ దిలకించుచున్న ఖుదీరాము నామె చూడనేలేదు. ఖుదీరామ్ వెయిటరుతో తనకు కావలసిన పదార్థములను జెప్పినాఁడు—వెయిటరు నిష్క్రమించెను.

సంగీత మాగిపోయినది—ఆమెయొకపరి గదిని నల్వంకలఁ బరికించినది—ఆపరికింపు ఖుదీరామునకు పారవశ్య మొసగూర్చినది. ఆతఁ డప్పుడామె ముఖమును దర్శించినాఁడు గుండ్రముగను, ప్రసన్నముగను ఉన్న ఆముఖము—విశాలములు—కాంతిమంతములుగు నేత్రములతో వెలుఁగొందుచున్న ఆముఖము—నానిహృదయమునందు చిత్రింపబడినది. ఆమెనోరు చిన్నదిగను, పెదవులెఱ్ఱగను ఉన్నవి. ఆమెలో పరిపూర్ణమగు సత్స్వభావము స్త్రీత్వము గోచరించుచుండెను.

ఆమె తనప్రక్కనున్న బల్లకడ కెవ్వరో వచ్చియుండిరని తెలిసికొన్నది. తత్క్షణమే తనదృష్టుల నాదెసకు త్రిప్పినది. ఖుదీరామ్ ప్రశంసా పాత్రముగనామె నొకపరి తిలకించినాఁడు—చూపులతో చూపులు కలిసినవి.

తొలుఁదొల్తు నాముహూర్తమున—ఆమెకనుబొమ్మ లత్రముతో మీఁదికిలేచినది. ఆతని నదివరకెక్కడో, ఎప్పుడో చూచితినని ఆమెనమ్మకము. ఆతఁ డామెలో ప్రకృతి విరుద్ధములగు స్వభావములుగాని—కృత్రిమ హాసభావములుగాని పొడఁగట్టమి, ఆశ్చర్యపడి వినోదించినాఁడు. అంతేకాదు! ఆమెనుగురించి యెక్కుడుగా తెలిసికొనుటకు—గ్రహించుటకు నాతఁడు తొందరపడుచున్నాఁడు.

ఆతని ముఖమున మందహాస మంకురించినది. ఆమె యొకక్షణము మువరకు వెనుదీసినది—పిమ్మట నాతనిమందహాసమునకు ప్రత్యుత్తరముగా నామెపెదవులపైని చిరునవ్వు పొడసూపినది ఆచిరునవ్వుతో

కృతిమముగాని — వక్రభావముగాని—లజ్జగానిలేదు. ఆమెమరల నార్కెష్ట్రావంకఁదిరిగి—తనదృక్కుల నాదెసకు పరపుచున్నది.

ఖుదీరామ్ మిన్నకుండలేదు-యాతఁడామెవంకఁ జూడఁగలిగినపు డెల్ల నవ్వుచునేయుండెను—తనకామెతో పరిచయములేకున్నను, యా నవ్వే సంతృప్తిని గలుగఁజేయుచున్నదని యాతఁడు తలంచుచుండెను.

"ఆమెమనోహరమయినది—ఆమెనుబోలిన యువతిని నేనిది వఱకెన్నడును చూచియుండలేదు. ఆమె అందకత్తెమాత్రమేకాదు... ...నిజమయిన యామెది......కారణమును నేనుచెప్పలేను......" అని ఆతఁడు తనలోఁ దాననుకొనుచుండెను.

వెయిటరుతెచ్చిన పదార్థముల నాతఁడు సంతృప్తిగా ఆరగించెను. అవి మిక్కిలి రుచికరముగానున్నవి. ఆతనికి సంతోషమును కలిగించినవి. ఆతఁడు పరోటానుతినుచు నొకపరి కన్నుల నామెపైఁ బ్రసరింపఁజేసినాఁడు. ఆతని కప్పుడు నవ్వు రాలేను. ఆమెచూపులలో తన చూపులనుగలుపుటకును—ఆమెకంఠస్వరమునాలకించుటకును—ఆమె చేతులను తనచేతులతో గిలించుటకును—ఆతడు కుతూహలపడుచుండెను—ప్రార్థించుచుండెను—ఉవ్విళ్లులూరుచుండెను.

ఆమె కాఫీని స్ఫూర్తితో త్రాగుచున్నది—ఆమెను తదేకధ్యానముతో చూడవలయుననియే ఖుదీరామ్‌తలంపు! ఆమెనుగూర్చి వాని హృదయములో కారణములేనికలవర మదయించినది.

కాఫీనిముగించినపిమ్మట—ఆమె గదిని మరియొకపర్యాయము కలయఁజూచినది. పిమ్మట తననంచినివిప్పి అందులోనున్నయొకకార్డును బయటకుఁదీసి—పెన్సలుతో దానిమీఁద నేమోవ్రాసినది. తరువాత వెయిటరునుబిలిచి, యాకార్డును ఆర్కెష్ట్రా కండక్టరునొద్దకు పంపినది. కండక్టరామె కోరికను మన్నించినాఁడు

ఆర్కెష్ట్రా బేండుట్యూను వాయించుచున్నంతసేపును—ఖుదీరామ్ మెహతా—ఉద్రేకము ననుభవించుచున్నాఁడు. ఆతఁడాత్రముతో నాలకించి తనలో అమితముగ హర్షించినాఁడు.

ఆట్యూను ముగియుటతోనే—ఆతనిలో సంభ్రమముదయించినది—ఆతఁడు వెయిటరును బిలిచెను—ఒక కార్డు నామెకూరుచుండిన మేజాబల్లకడకు పంపెను. వెయిటరా కార్డునుతన మ్రోల పెట్టుటతోనే—ఆమె కొంచెము చలించినది. అదికనిపెట్టి ఆతఁడొకపరి నవ్వెను. ఆమె గదిని నల్వంకల నలక్ష్యముగా చూచినది; అంతే! ఆతనిహృదయములో మాత్రము నిరాశ అంకురించినది— ఆతనిగుండె నిలిచిపోయినదనియే చెప్పవచ్చును.

"నేనుగూడ మెచ్చుకొంటిని—"

అను మాటలా కార్డుమీఁద వ్రాయఁబడినవి—ఆమెచిరునవ్వుతో చదువుకొన్నది. పిమ్మట నాతనిదెస నంగీకారసూచకముగా మోము నుద్రిప్పినది. వెయిటరు బల్లయొద్దనుండి వెళ్ళిపోవుచుండెను. ఖుదీరామ్ మెహతా—ఆందోళనతో వానిని మరలఁ దనకడకు రావలసినదని తల యూచినాఁడు.

"ఇంకొక కార్డును దీసికొని ఆమెకిమ్ము—నేనొకవిషయము వ్రాయమరచితిని—" అని ఆతఁడు వెయిటరుతో పలికి—కార్డును బయటకుఁదీసి—

"నేను మీయొద్దకు వచ్చి మాటలాడవచ్చునా!" అనివ్రాసినాఁడు.

ఆమె—వ్రాయుచున్నంత సేపును తదేకదృష్టితో—తన్నుఁగనిపెట్టుచున్నదని గమనించి—ఆతఁడు సిగ్గుపడెను. తప్పక—ఆమె తన కార్డును చదువుటకు నిరాకరించునని ఆతఁడనుకొనెను. కాని, అట్లుజరుగలేదు—ఆమె నిరాకరింపలేదు—ఆకార్డును చదివి—తనకట్టెదుటబల్ల

మీఁద, మొదటిదాని ప్రక్కనే దానినిగూడనుంచి, కుడివంకఁదిరిగి——"రండ"నునట్లు తలయూడించినది.

సంతోషముతోను--ఆత్రముతోను, అతఁడులేచి నిలువబడెను. కాఫీని దీసికొనిరమ్మని వెయిటరున కాజ్ఞాపించెను. అతఁడామెబల్లయొద్ద కేఁగి——కట్టెదుటనున్న కుర్చీలో కూరుచుండెను——వెయిటరు వెళ్ళిపోయినాఁడు. యామెతో సంభాషణకెట్లుపక్రమింప వలయునో తెలియక——యాతఁడు క్షణకాలము మౌనమువహించెను. యాకస్మికముగ మధురమగు కంఠస్వరమాతనికి వినిపించినది——

"మీకార్డులు మిక్కిలి ఖరీదుగలవి-" అనిఆమెనుడివినది.

అతఁడు నవ్వినాఁడు; కానిఆనవ్వులో నాందోళన మిమిడియున్నది.

"మీరునామొదటికార్డునే త్రోసిపుత్తురేమోయని నేనుభయపడితిని-"

ఆమె——పరికాశించుచు ద్రవించుచున్నతన నేత్రములనాతనపైనిల్పి, మనోహరముగమందహాస మొనరించినది.

"అయిన సాధారణముగా మీరు స్త్రీలయెడల భయపడుచుందురా!" అనిఆమెప్రశ్నించినది.

అతఁడు తలయూచినాఁడు.

"నేనువారియెడల భయపడుటకు- నాకువారితో సంబంధము లేదు-కాని ఈరాత్రినేను భగ్నహృదయుడను"

"భగ్నహృదయులా?"

యాతఁడు తలనంగీకార సూచకముగా ద్రిప్పినాడుఁ

"అందువలన మీరు సాహసమునుగూడ నవలంబించితిరా"

యాతడుతనచేతులను కుర్చీమీదనానుకొని, వెనుకకుచేరగిలబడియదార్ధమామెకు వినిపించినాఁడు.

"ఎందుచేత?" అనియామెఅడిగినది.

"ఈరాత్రి మాత్రమేనేను స్వేచ్ఛగా సంచరింప వచ్చును. స్వాతంత్ర్యవాయువులను పీల్పవచ్చును. రేపుప్రొద్దుటనాకు వివాహముకానున్నది."

యామెతనమాటలకు నవ్వునని యాతఁడు తలంచినాడు-కాని యామెనవ్వలేదు. సరిగదా! యామెఉలికిపడినది. పిమ్మట మెల్లగా నా మెకంఠమునుండి ఈక్రిందిప్రశ్న వెలునడినది_

"రేపు ప్రొద్దుటా?"

యామెక్షణకాలము మౌనమువహించినది. పిమ్మట-"ఓహో! నేనెందులకట్లు ప్రశ్నించితిని?" అనిమరలనుడివినది-యాతఁడు విస్మయముతో నామెనుచూడసాగెను.

"ఎందులకు ప్రశ్నింపరాదు? మీరీపూఁట ఇక్కడ ప్రత్యక్షమగుటకు కారణమును విస్పష్ట మొనరించితిరి.—మీధోరణియే నాకాశ్చర్యమును గలిగించుచున్నది- రేపు ప్రొద్దుటమీరు పెండ్లాడనున్నారు కాని యిప్పుడు కాదుగదా?"

యామె అనవసరముగా చాలవరకు ప్రసంగించితినని తనలో దాననుకొన్నది. ముహూర్త మాత్రమాతని బరికించి, పిమ్మట లేచినిలువఁబడి—

"మనమిరువురము కొంతసేపు డ్యాన్సు చేయరాదా?" అని యాతని బ్రశ్నించినది.

ఖుదీరామ్ మెహతా ప్రార్థనపూర్వకముగా "మీపేరు నేనెరుగ వచ్చునా?" యనియడుగుచు రెండుచేతులతో నామెను బట్టుకొనెను యామె ప్రత్యుత్తరమీయలేదు. కొంతవరకిరువురును పాశ్చాత్య పద్ధతులననుసరించి, డ్యాన్సు కావించిరి. యాసందర్భలో నేవోకొన్ని విష

యములను ముచ్చటించుకొనిరి. కాని అవినూపాఠకులకంత ముఖ్యములుకావని మానుపవి.

డ్యాన్సు ముగిసినది—హృదయములలో నిరువురును-నృత్యము సేయుచున్నట్లు తలంచుటలేదు. ఇరువురకు నొకవిధమగు యాందోళనము కలిగినది—యదియదార్ధమయినది-సంతోషకరమయినది. అందుచేతనే వారు దీర్ఘకాలము డ్యాన్సు చేయుచున్నపుడు సంభాషణకుపక్రమింపలేదు—యాతఁడామెదెస నిశ్చలముగా పరికించుచున్నాఁడు. యామెకీఁక మర్యాదగా సంబోధించుట కవసరము కన్పట్టలేదు—

"చెప్పుము—నాదెసనిలుకడగా నెందులకు పరీక్షించుచున్నావు? నీవేమి తలంచుచున్నావు?" అని ఆమెసవినయముగా ప్రశ్నించినది.

"నీవెంత అందముగనున్నవోయని—నేనాలోచించుచున్నాను-నీకండ్లలోను—పెదవులలోను—చిరునవ్వులోను—కంఠములోను—వ్యక్తమగుచున్న ఆకర్షణశక్తిని గురించి యాలోచించుచున్నాను."

ఆతఁడామెను క్షమింపమని వేఁడలేదు—ఆమెముఖమున లజ్జాచిహ్నములు పొడసూపినవి. కాని ఆమె నవ్వలేదు.

"నీవుకూడ నన్నుగురించి ఆలోచించుచున్నావని నేననుకొనుచున్నాను—"అని యాతడామె చూపులలో తనచూపులనుగలిపి, ప్రశ్నించెను. ఆమెపెదవులు వడఁకినవి—తదేకదృష్టితో నాతని బరికించుచు—యామెతలయూచినది.

"నీవెంతమంచి వాఁడవోయని నేనాలోచించుచున్నాను, నీవంటి యువకుని నేనింతకు పూర్వమెప్పుడును చూచియుండలేదు. నిన్ను నాబల్లయొద్ద కెందులకు రానిచ్చితినాయని నేనాశ్చర్యపడుచున్నాను-" అని యామె నవ్వసాఁగెను.

యాతఁడామె చేతిని దనచేతఁ బట్టుకొని అదుముచుండెను—యామె ముఖమును నిశ్చలముగా పరికించుచుండెను—" ఇఁకమీఁద నాజీవిత మేమయినను నేను లక్ష్యపెట్టను— ఇన్ని సంవత్సరములకు

నేనీక్షణమందు-వాస్తవమునకు బ్రతుకుచున్నాను. జీవితసౌఖ్యమును నేనీక్షణమున మాత్రమే అనుభవింపఁగలుగుచున్నాను-" అనుమాటలాతని చూడ్కులలో వ్యక్తపడుచున్నవి.

ఇరువురును మంత్రముగ్ధులవలె నొకరినొకరు పరికించుకొనిరి. ఆసమయమందొకప్పు డొకరిపెదవుల నింకొకరిపెదవులు దాకినవి. ఆమె వెనుకకుతగ్గి నవ్వినది-పిమ్మట నిరువురును మరల మేజాబల్లకడకు వచ్చిరి.

"ఈప్రదేశ మసహ్యముగానున్నది." అనిపలుకుచు నామెకుర్చిలో నాసీను రాలాయెను.

"అతడామెను దిలకించుచు-" క్యావలెట్ హోటలుఅసహ్యముగానున్నదనినీవుతలంచుచున్నావా?......కాదు......ఇదిమనకొఱకునిర్దేశింపఁబడినది......నీవుకూడనావలె స్వేచ్ఛగా నుండుటకుకోరుచున్నావు......మనమింకొకస్థలమునకు పోయినచో ............

ఆమె కంపించినది—నేత్రములలో నాతురత గోచరించుచున్నది బుగ్గలెఱ్ఱఁబాఱినవి.

"ఎక్కడకు?"

"బొంబాయినగరములో వినోదముగా పొద్దుపుచ్చుటకు ప్రదేశములేలేవా? విక్టోరియాకోచి నెక్కినచో—ఎక్కడి కయిన పోవచ్చును?"

ఆమెత్వరితగతిని తనచేరుమాలును సంచిని దీసికొన్నది. హేళనాపురస్సరములగు దృక్కులనాతనిపై నొకసరి పఱపినది. లేచిఅతనికెదురుగా నిలువఁబడినది.

,,అగును—ఈరాత్రి మనమెక్కడికయిన పోయి డ్యాన్సుచేయవచ్చును. ఇతరవిషయములను మరచిపోవుటకు నేను ప్రయత్నించుచున్నాను." అనిఅతఁడనెను.

ఆమె అతనిచేతిని బట్టుకొన్నది-అతడు బిల్లుమొత్తమునిచ్చినవె నుక నిరువురును బయటకు నడచిరి—విక్టోరియాకొఱ కెదురుచూచు చుండిరి.

బండిలో వారిరువురును—,,హానీమూన్ క్లబ్బునకు పోయిరి. అ క్కడ కొంతసేపువివిధ విషయములను గుఱించి ముచ్చటించిరి—కొంత సేపు డ్యాన్సు చేసిరి—కొంతసేపు తేనీటిని త్రాగిరి. ప్రపంచములు స్వర్గీ యసౌఖ్యము నను భవించు చున్న ప్రాణస్నేహితులవలె నాయిరువురును మెలంగిరి. అతను—ఆమె మాటలకు—చిరునవ్వునకు—మౌనమునకు, అప్పుడప్పుడువిస్మయ మందుచు నేయుండెను.

ఇరువురును—అప్పట్ల తమకుప్రాప్తించిన అవస్థనుకొంతవరకు స్పష్టముగాఁ దెలిసికొనఁ గలిగిరి. అదివరలోఁ దమహృదయములలో నె ప్పుడును పొడసూపని—ఉత్తేజము—ఉద్రేకము—అప్పుడుపొడ సూ పినదని గ్రహించిరి. ఆయుద్రేకము తప్పని సరియైనది—శాశ్వతమయి నది—ప్రచండమయినది.

అర్ధరాత్రియినది—ఆమెలేచి నిలువఁబడి, తాను వెళ్ళిపోవలసి యున్నదని చెప్పినది.

"నేనునిన్ను సాగనంపుదునా? అని ప్రార్థనాపూర్వకముగా, అతఁడు ప్రశ్నించినాఁడు.

ఆమె ప్రత్యుత్తరమీయలేదు, ఒకపరి వానినవలోకించినది, ఒక మందహాసమును వెలిపుచ్చినది.

ఇరువురు విక్టోరియాను బాడుగకు కుదుర్చుకొని—బేకల్ స్ట్రీ టులోనున్న యొకసౌధము చెంతకు వచ్చిరి.

బండినుండి దిగుటతోనే, ఆమె వెనుకకుఁదిరిగి—కరస్పర్శమొన రించుట కాతనిచేయిని పట్టుకొన్నది—అంతలోనాతఁడు బండివానిని పొమ్మని చెప్పినాఁడు.

"క్షణకాలము నన్ను నీ మేడమీఁదకి రానీయవా? మరలనెప్పుడును మనము కలసికొనము—మనసమావేశమును జ్ఞప్తియందుంచుకొనుటకయిన నీవు నాకేనస్తువయిన నీయవచ్చును." అని ఆతఁడు వినయపూర్వకముగా కోరినాఁడు.

"నీకిచ్చుటా?........." అనుమాటలనామె బరువగు మనస్సుతో ననుమానరహితముగ నుడివినది.

"అగును—ఈగదిలో నిప్పుడు నీవున్నట్లే—నేను నిన్నెప్పుడు జ్ఞప్తియందుంచుకొనుటకు చిహ్నముగా........."

ఆమెపెదవులు కంపించినవి, ఆమెనవ్వుటకు ప్రయత్నించినది "బాగున్నది" అనుచు నామె దారితీసినది. మేడయొక్క ఉపరిభాగమునకు పోవుటకు ఎలక్ట్రిక్ లిఫ్టు ఉన్నది. కానియామె దానిలో నిలువఁబడలేదు. మూఁడవ అంతస్తుమీఁదికి ఆతనితోఁగూడ మెట్లుద్వారా పోయినది.

మేడమీఁదనామె క్రిందమూఁడు గదులున్నవి, సేవకులెవ్వరును, అందులేరు—ఆమెవానిని పరిశుభ్రముగా నుంచుకొనుచున్నది. మధ్య గదియొక్క తలుపు దీయఁబడుటతోనే—ఖుదీరామ్ మెహతా అందు ప్రవేశించినాఁడు—ఆమె ప్రక్కగదిలోనున్న యొకబల్లమీఁద తన సంచిని పెట్టి మరల నాతనియొద్దకువచ్చి నిలువఁబడినది.

"ఇదేనాయిల్లు......నీకసంతృప్తిని గలుగఁజేయుచున్నదా?" అని ఆమెనవ్వుచు ప్రశ్నించెను.

ఆతఁడు 'లేదని' తలయూచినాఁడు—వానిచూడ్కులు గదిలోనున్న వివిధవస్తువులమీఁద వ్రాలుచున్నవి.

"ఈగృహమును నీవేఅలంకరించితివా?"

"ఆఁ; నాఆదాయము ననుసరించి నేనేనాకు కావలసిన వానిని గొనుచుందును; నేను నాపొట్టకొరకు ఉద్యోగము చేయవలసియున్నది;

ఆఫీసులో కష్టపడి ఉదయము 10 గంటలనుండి సాయంకాల మారుగంటలవరకు పనిచేయ వలసియున్నది—నేను వారమున కొక్కపర్యాయము మాత్రమే క్యావలెట్ హోటలునకు భోజనార్థమై వెళ్ళఁగలుగుదును." ఆతఁడామె నొకపరి పరికించినాఁడు—ఆమెహస్తమును తన చేతితోఁ బట్టుకొన్నాఁడు.

"ఈగది అందముగనున్నది—చాలఅందముగ నున్నది; నిజమునకిది దేవతాగృహము—దేవతానిలయము, అలంకారమునకుఁగాని—డాంబికమునకుఁగాని, యిచట వస్తువులులేవు; కేవలము మానవజీవితమునకుపకరించునవి—మానవజీవితమును సుఖప్రదమొనరించునవి మాత్రమేయున్నవి. ఆమె బిగ్గరగా నవ్వినది.

"నీవు క్యావలెట్ హోటలున కెందుకు వెళ్ళుచుందువు?"

"క్యావలెట్—బొంబాయి నగరమునఁగల హోటల్సులో ప్రశాంతమయినది—చక్కనిది, నేను విశేషముగా ధనవ్యయమున కంగీకరింపను—ఈగదిలోనున్న వస్తువులన్నియు నీవు చెప్పినట్లు నాకు అవసరములయినవే! నేనేవస్తువయిన గొనవలసివచ్చినచో ఆలోచించి—పిమ్మట జాగ్రత్తగా పరిశీలించుకొనెదను. అనవసరముగా ధనవ్యయమునకు నా మనసొప్పదు, నాజీతములో ఖర్చులుపోను మిగిలిన డబ్బు నేనుదాచుకొందును.........

ఆమెయెందుచేతనో, ఆకస్మికముగా తనమాటలను ముగించినది, పెదవినికొఱికినది, అతడామెను రెప్పవేయకుండ చూచుచుండెను. ఆతడేమియునుమారుపలుకరాదని ఆమెతలంచినది తలంచి తొందరగాలేచి రెండుగ్లాసులలో ఫ్లాస్కులో నున్న తేనీటినిపోసి మేజాబల్లమీద పెట్టినది పిమ్మటనాతని ప్రక్కగూరుచున్నది. ఇరువురును తేనీటినిత్రాగిరి ఆసమయమున తేనీటినిచ్చుట వింతకాదు...ఆచారము గాదు...! ఆమెతెచ్చిఅక్కడబెట్టినది, ఇరువురును త్రాగివేసిరి. మంత్రముగ్ధులవలె

నిరువురును బాహ్యప్రపంచమును మరచిపోయిరి.........ప్రేమును మరచిపోయిరి. తమ్ముఁగూర్చిన గొడవతప్ప, ఇతరగొడవలు వారికి తెలియవు. వారు మాటలాడుకొనిరి—యదార్థముగా తమ్ముగురించి యే మాటలాడుకొనిరి.

ఖుదీరామ్ మెహతా—ఆమెకు తనజీవితమును వాస్తవముగా వినిపించినాఁడు. అనేకసంవత్సరములనుండి తనగాధను—తనకష్టసుఖములను ఎవ్వరికయినఁ జెప్పుకొనవలయునని ఆతనికి కుతూహలమున్నది—అదినేఁడు నెరవేరినది—అంతకుపూర్వమాతనిగాధ నాలకించువారెవ్వరునులేరు. ఆతఁడు గోహారును గురించి ముచ్చటించినాఁడు—ఆసందర్భమునందు మాత్రమాతఁడసత్యము వచించినాఁడు. ఆతఁడు రేపటి పెండ్లినిగురించియు, "హసీనూాయి"ను గురించి నామెకు తెలియజేసినాఁడు. అప్పట్లనామె ముఖమెత్తి తీక్షణముగా నాతని దెస చూచుచుండెను. ఆతఁడు మిన్నకుండెను.

"నేనునీకు విసుఁగును పుట్టించితినా?"

ఆమె ఆతనిచేతులను బట్టుకొని మెల్లఁగా అనుటకారంభించెను—వినయపూర్వకముగా నాతనినుద్దేశించి—

"నీవు—పెండ్లాడనున్న యువతిని ప్రేమించుటలేదా?......
......నీవెందులకట్లు చేయుచుంటివి? అది అన్యాయముకాదా? ఆమెకును, నీకును అసౌఖ్యకరముకాదా? పెండ్లియనఁగా............"

ఆమె అర్థోక్తిలోనే తనమాటనుముగించి, తన్ను క్షమింపుమని ఆతని వేఁడుకొన్నది. యాతఁడామెనుదేరిక పూరితములగు నేత్రములతో నవలోకించినాఁడు.

"ప్రేమరహితమగు పెండ్లికి, నేనంగీకరింపను-అంగీకరింపలేదు-లేకున్న నీయుదయమున నాకు వివాహము జరిగియుండెడిదే!" అను

మాటలామె నోటినుండి వెలువడినవి. యాతఁడత్యంత విస్మయమునంది నాఁడు.—

“నీమాట యదార్థమే! నీవుచెప్పినదెల్ల వాస్తవమే! కాని, నేనిప్పుడేమియు చేయలేను—తరుణము మించిపోయినది—నాపెండ్లి తప్పనిసరి పెండ్లి......నీవు—పెండ్లికి వెనుదీసితినని చెప్పుచున్నావు! ఎందుచేత? నీవాతనిఁ బ్రేమింపలేదా?”

ఆమె తలనుంకించినది.

“అగును—నేనాతనిని ప్రేమింపలేదు—ఆతఁడు కోపగించి నాఁడు; కాని నేనట్టి మంచివాని నిదివరకెన్నడును గనివినియెరుఁగను_ చక్కనివాఁడు—విద్యాధికుఁడు; ధనవంతుఁడు; అయిననేమి? నేను ప్రేమింపలేదు—ప్రేమింపలేకపోయితిని.”

ఆమె ముఖమును దిప్పుకొన్నది—ఆమెచూడ్కులలో దీన భావమును, ఆవేదనయు, గూడఁ గన్పట్టుచుండెను.

“నీవు-త్రికరణశుద్ధిగా ప్రేమింపనప్పు డెవ్వరిని బెండ్లాడరాదు- అది తప్పిదమనుమాట నీకుతోఁచలేదా?” అనిఆమె మృదువుగా ప్రశ్నించెను.

“అయిపోయినది—ఏమనుకున్నను లాభములేదు”—అని ఆత డు కష్టముతో మారుపలికెను.

ఆమె బిగ్గరగా నవ్వినది.

“అయిపోయినది? అయిపోవునదేమి? ప్రేమలేనిపెండ్లి ఎందుల కు జరుగవలయును! స్త్రీలు ధనకాంక్షచేతను—పురుషులు దర్జాకొర కును, ముందువెనుక లాలోచింపక, పెండ్లిబాంధవ్యముల నేర్పరచు కొని—‘పెండ్లి’ అను కార్యమును జులకనచేయుటా? వారికిఁగల స్వార్థ భావమును—ప్రేమకు వ్యతిరిక్తముగా నడిపించుటా?”

ఆమె మరల మౌనమువహించినది—కుషాసుమీఁదికి వాలి కూరుచున్నది.

"కాని—నేనట్లు చేయలేను—ప్రేమలేని పెండ్లికి నేను సమ్మతింపను—ప్రేమ అనుదానిలో అనేక పదార్థములిమిడియున్నవి—జీవితమంతయు ప్రేమలోనున్నది—సంసారము నీదుచుటకు సౌఖ్యమందున్నది—నిరాశ అందున్నది. ప్రేమతత్త్వము వేరు—ప్రేమపథమున స్త్రీపురుషులిరువురును సమానులే ఆతఁడాశ్చర్యముతోను—క్షణక్షణమునకు పెంపొందుచున్న ప్రశంసాభావముతోను—ఆమెనవలోకించి-

"ప్రేమలో ప్రపంచమిమిడియున్నదని నీయభిప్రాయమా!" అని ప్రశ్నించినాఁడు.

"అగును—ప్రేమలో ప్రపంచమిమిడియున్నది" అని ఆమె ఆతనికి ప్రత్యుత్తర మిచ్చినది—ఆమెకంఠము దేశిక పూరితములు—కన్నులు కాంతిమంతములు—ముఖమునను మచ్చెమటలు క్రమ్మినవి. తాను మనఃపూర్వకముగా యథార్థమని నమ్మిన విషయములనే ఆమె వాక్రోనుచున్నది.

ఆమె లేచినిలువఁబడినది; ఇంచుకసేపు నిశ్చలముగా నాతని బరికించినది—

"నీవు వెళ్ళిపోవలయును...వెళిపోనక్కరలేదా?" ఆతఁడు తల యూచుచు లేచినిలువఁబడెను.

"అగును—వెళ్ళిపోవలయును...కాని ఇక్కడనుండ వలయునని యే నాకున్నది...ఎప్పుడును...ఎల్లవేళలందును...ఇక్కడనుండి పోవలయుననియే నాకున్నది..." ఆతఁడు నవ్వుటకు ప్రయత్నించినాడు. ఆమెచేతులను మీఁదికెత్తి, ఒకపరి ముద్దుకొనెను.

ఆతనిలో నాకస్మికోద్రేక ముదయించినది.

"కాని...ఈరాత్రి నేను స్వేచ్ఛగానున్నాను......నేను వెళ్లి

పోవుటకుముందు నీకొక విషయమును చెప్పుచున్నాను......కాదు ...చెప్పుటకు వందలు—వేలు—విషయములున్నవి—రెండు విషయములను చెప్పుచున్నాను...రెండు విషయములుం జాలును-ఈరాత్రి నీవునన్ను సుఖపెట్టితివి—ఇట్టిసుఖమును నేనింతవర కెన్నఁడును నేననుభవించి యెరుఁగను...ఇఁక రెండవ విషయము.........!"

ఇంతకు పూర్వము......నీవంటియువతిని నేనెన్నడును.........!"

అతని చేతులామె మెడను చుట్టినవి. ఆసమయమున నట్లగునని అతఁడుగాని—ఆమెకాని అనుకొనలేదు—అతని పెదవులామె పెదవులను ముట్టినవి......అతఁడామెను ముద్దుపెట్టుకొనెను! అంతకు పూర్వమెన్నడును అంత సౌఖ్యకరమగు ముద్దు నాతఁడేయువతికిని ఇచ్చియుండలేదు!

అతఁడా పండ్రెండు సెకండులలో స్వర్గ సౌఖ్యము ననుభవించుచున్నట్లు భావించెను. అతఁడు.....తెల్లవారినవెనుక తన దాంపత్యజీవిత మెట్లుండునో గ్రహించినాఁడు

గోహార్ యొక్క కృత్రిమప్రేమ...తనయొక్క కృత్రిమప్రేమ! కాని అతఁడేమిచేయఁగలఁడు—తప్పనిసరి పెండ్లి! ఆయిరువురి జీవితములను విషాదాంత మొనరించుటకా పెండ్లి తప్పదు.

ఇదిప్రేమ!—అతనికి జీవితములో—తనబాహువులలో బంధింపబడిన స్త్రీవంటి స్త్రీ కావలయును—

ఆమె మెల్లగా—కొంతసేపయిన పిమ్మట నాతని బాహువుల నుండి యీవలకు జారినది—వానిని తలుపుదగ్గరకు త్రోసినది.

"నీవిప్పుడు వెళ్ళవలయును—వెళ్ళవలయును."

కాని అతఁడామెను మరల గౌగలించుకొనెను—

"ఒక్కసారి—తనివితీరనిన్ను ముద్దిడుకొననిమ్ము" అతఁడామెను చుంబించినాఁడు. మరల చుంబించుటకు ప్రయత్న మొనరింపగా నామె పరిహాస పాత్రములగు దృక్కుల నాతనిపై ప్రసరించుచు—

"నీస్వేచ్ఛ యింకనెంతోసేపుండదు—" అన్నది.

ఆతఁడు మరల నామెను దనబిగికౌఁగిటయందుఁ జేర్చుకొనెను-మరల ముద్దులవర్షము నామెపై గురియించెను......కొంతసేపయిన పిమ్మట ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసములను బుచ్చుటకుఁగూడ శక్తిలేక-దూరముగా నిలువఁబడియున్నపుడు—

"నీపేరేమి? ప్రేయసీ! నీపేరేమి?" అని ప్రశ్నించినాఁడు.

ఆమె చెప్పినది.

"మిస్. గులాబ్!"

"మిస్. గులాబా?" అని ంతఁడు తిరిగి ప్రశ్నించెను.

"అగును—"

ఆతఁడు మరల నెమ్మదిగా నామెను తన వక్షముమీఁద వ్రాల జేసెను—

"విను—గులాబ్! విను—నేనునిన్ను ప్రేమించితిని—నేను ప్రేమించు యువతులలో నెప్పటికయిన, నీవే మొదటిదానవు—నీవే ఆఖరుదానవు—నేను నాజీవితాంతము వరకును నిన్ను ప్రేమించుచునే యుండెదను—నాహృదయము నీయది—నీకుస్వాధీనము.''

"అట్లనకుము—అట్లు చెప్పకుము—మనమిరువురమిప్పుడే విడిచిపోవుచున్నాము, మరల నొకరికొకరము చూచుకొనలేముకదా!" అని ఆమె పలికినపలుకులు వానికి ములుకులయినవి.

"గులాబ్! నీవావిధముగా ప్రత్యుత్తర మీయవద్దు......"

ఆతఁడామెను పరికించుచుండెను—ఆమెనుండి సమాధానముకొరకు—సరియైన సమాధానము కొరకెదురు సూచుచుండెను. ఆమె ఆసంగతి కనిపెట్టినది—

"ఖుదీ! నేనునిన్ను గాఢముగ ప్రేమించితిని"—అనుమాటలప్రయత్నముగా ఆమెనోటినుండి వెలువడినవి—విజిటింగ్ కార్డుమీఁ

దనాతనిపేరును జూచి జ్ఞప్తియందుంచుకొన్నదని వేఱుగఁ జెప్పనక్కర లేదు!

అతఁడు మరల నామెను కౌఁగిలించుకొనెను......చివరకాతఁడతి కష్టముమీఁద—"గుడ్‌నైట్! గులాబ్?" అనఁగలిగెను.

"గుడ్‌నైట్! ఖుదీ! గుడ్‌బై"

ఖుదీరామ్‌మెహతా మెల్లగా గదినివిడిచిపెట్టి—మేడమెట్లను దిగి—నిర్మానుష్యముగానున్న వీధిలోఁ బ్రవేశించినాఁడు. పిమ్మట 'మేఫెయిర్'లోనున్న తనగృహము దెసనడచుట కారంభించినాఁడు—

అతఁడు మరల గులాబ్‌నెప్పుడు దర్శింతునాయని ఆలోచించుచుండెను!

---

## మూడవ ప్రకరణము.

---

ప్రాజ్ఞులగువారెన్నఁడును—'పరిపూర్ణత' అనువిషయమునుగురించి, తర్కవితర్కముల కుపక్రమింపరు. ఈవిశ్వమానవప్రపంచములోఁగల అనంతకోటి వ్యక్తులలో 'పరిపూర్ణత' అనునది ఎందులోను—ఎవ్వరిలోను లేదని వారు గ్రహింపఁ గలుగుదురు. మనుజులలో పరిపూర్ణత గోచరించిననాడు-ఇఁక వేరుగా దైవములక్కరలేదు; ఆరాధనము లక్కరలేదు; అర్చనలక్కరలేదు— సర్వవిద్యలయందును, లేక, సర్వవిషయములందును పరిపూర్ణుఁడగు వాఁడే భగవంతుఁడు!

ఖుదీరామ్‌మెహతా—తనజీవిత విధానములోఁ లేక, తనసంసార సౌఖ్యములో—పరిపూర్ణతకొరకు ప్రాధేయపడునంతటి బుద్ధిహీనుఁడు కాఁడు—అతనికి సంతృప్తియున్నది. ఆనాఁటిరాత్రి తాననుభవించిన

సౌఖ్యమునే, ప్రతిదినముఁ దనభార్యతో గలసి అనుభవించుచున్నట్లు భావించి, అతఁడు సంతోషపడుచుండెను.

అతఁడు గోహారును "హనీమూను" దినములలో మలబారు కొండలకు తీసికొనిపోయెను—అతఁడామెతో నక్కడున్నంతకాలము-- ఒక్కపర్యాయమయిన గులాబ్‌ను గురించి తలంపలేదు!

సాధారణముగా పురుషుడట్లుండును—అతఁడెప్పటికప్పుడు విషయములను మరచిపోవుచుండును. గులాబ్ నకును, గోహారునకును తారతమ్యము కొండంతయున్నది. గులాబ్ స్వప్నకన్య! గోహార్ సామాన్యముగా వర్తించు సంసార స్త్రీలలో తలమానికమువంటిది— ఆమె తనభర్తయొక్క మనస్సెరిగి, అతని నభిమతములనీడేర్చుటకెల్ల వేళలయందు సంసిద్ధురాలే! అతడు కోరినంత కామోద్రేకమామెలో లేకున్నను, ఆమె అందముగను, మనోహరముగను ఉన్నది. వివాహ పాశమాయిరువురను దృఢముగా బంధిచినది—ఆమె అతనియెడల నమితోత్సాహమును వ్యక్తపరచు చున్నది.

ఆహనీమూను నెలలో—ఖుదీరామ్‌మెహతా—అనేకరాత్రులందు, తనబాహువులలో గోహారును బంధించి, ప్రీతిపురస్సరముగా- హృదయ పూర్వకముగా నామెతో సంభాషించి సౌఖ్యమందినాఁడు. అట్టి సమయములందాతఁడు—గులాబ్‌తో గడపిన రాత్రి నిజ్ఞప్తికి తెచ్చుకొని తనలోతానే సిగ్గుపడెను.

వారు నెలదినములయిన పిమ్మట మలబారు కొండలనుండి, మరల బొంబాయి నగరమునకు తిరిగివచ్చిరి.

గోహార్—శక్తివంచన లేకుండ గృహకృత్యములను చక్కగా నిర్వహించుచున్నది. అతని సంతోషపెట్టుటకామె సర్వవిధములఁ బ్రయత్నించుచుండెను. ఆమె అతనిఁ బ్రేమించినది. ఎల్లవేళలయందు నాతఁడు చెప్పినచొప్పున వర్తించుచు-వానికి సంతృప్తికలిగించుటయే

ఆమె కోరిక ఆమె—తనగృహమును నత్యంత రమణీయముగను సుఖకరముగను జేసినది. పరిశుభ్రతగా దుస్తులనుంచుటయన్నను, గృహమునుంచుటయన్నను, గోహారున కభిలాషమెండు.

ఆమె యిరుగుపొరుగు వారికందరకు శిరోభూషణమయినది. సంసారమును దిద్దుకొనుటలో నామెకుఁగల పరిజ్ఞానము—నైపుణ్యము ఇతరస్త్రీలకులేదు, భర్తృసేవయందామె కిష్టమెక్కువ ఇంటిలోనున్నదనిగాని, లేదనిగాని, లెమ్మనిగానిచెప్పి, మగనిని వేధించుట గోహారున కలవాటులేదు—

ఒకప్పుడేకారణము చేతనయిన, ఖుదీరామ్‌మెహతా, వేళకు భోజనమునకురాక, టెలిఫోనులో చెప్పినను, ఆమెకు దిగులులేదు—ఇంటిలో నొంటిరిగానుండుటకు భయములేదు. విశేషించి ఆమె సేవకులను, దాసీలను దయతోఁ జూచుచుండును.

ఆమెకు ప్రాజ్ఞతగలదు, అనవసరముగా భర్తతో హద్దుమీఱి ముచ్చటింపదు. అంతేకాదు-తగినంత తొందరపని లేకున్న నాతనిదర్శనమునే కోరదామె!

ఖుదీరామ్‌మెహతాతో—ఓడవర్తకముకొరకు— పునహానగరములో నుండగా, గోహారొక మగబిడ్డని ప్రసవించినది. అప్పుడయిన నామె మెహతాకొరకు తొందరపడి కబురంపలేదు—"ఇప్పట్లనాభర్తయెందులకు?" అని దాదితోనన్నది. ఆమెకంత ధైర్యమున్నది. ధైర్యముమాత్రమేకాదు. భర్తయొక్క స్వభావము నామె బాగుగా గమనించినది.

గోహారునకు పురుడువచ్చిన రెండురోజులకు—ఖుదీరామ్ పునహానుండి తిరిగివచ్చెను. అతఁడు పురుడుగదిలో ప్రవేశించుసరికి—చక్కగా, పరిశుభ్రముగానున్న చిన్న మగశిశువు కంటఁబడినది—ఆశిశువునకు ప్రక్కనున్న మంచముమీఁదఁ గూరుచుండి, గోహారేదియో పుస్తకమును చదువుకొనుచున్నది.

ఆతఁడత్యంత మగుప్రేమతో గోహారును జూచుటకు ప్రియత్నించినాఁడు. ఆసమయము సంసార సౌఖ్యము, వానికి గోచరించినది. దాంపత్య మెట్టిదో ఆతనికి తెల్లమయినది.

ఆ రాత్రి—ఖుదీరామ్ మెహతా—తనసరనా గారమునఁగూరుచుండి, ప్రాపంచిక స్వభావమును గురించి ఆలోచింప మొదలిడెను. పెండ్లికిముందురాత్రి విషయములు వానికిజ్ఞప్తి కివచ్చినవి. అప్రియత్నముగా వానినోటినుండి నవ్వు వెలువడినది.

ఆతఁడు గులాబ్‌ను గురించి ఆలోచింపసాగెను—గులాబ్ ఏమి చేయుచున్నదో! ఎక్కడనున్నదో! ఏలాగునున్నదో! అదియేవాని సందేహము. ఈసమయమునందాతడుగులాబునుజూచుటకుకుతూహలపడుచున్నాఁడు. తనసంసారికజీవిత మత్యంత సౌఖ్యప్రదముగానున్నదని ఆమెకు తెలియఁజేయవలయునని ఆతడూహించుచున్నాడు.

హఠాత్తుగా వాని హృదయములో నాత్రి ముదయించినది. అంతవఱకు మెదడులోగల ప్రశాంతత నశించినది. ఆతనికి ప్రస్తుతజీవనమును, ప్రస్తుతపరిస్థితులను, లజ్జాహేతువులయినవి ఆతడేమిచేయ గలడు? ఆలోచనమును విరమించి, పడకగది లోనికి నిద్రించుటకు పోయినాఁడు.

మరియొక సంవత్సరము గడచిపోయినది. అప్పటికివివాహమయి రెండు సంవత్సరములు గడచినవి. ఖుదీరామ్ మెహతా యదార్థమును క్రమక్రమముగా గ్రహించు చున్నాడు—ఆతఁడును, భార్యయును—సంసారనౌకను చక్కఁగానీడ్చుచున్నారు; వివాదములుగాని అయిష్టతగాని, అసంతృప్తిగాని, అశాంతిగాని—వారిగృహములో లేదు—అట్లయ్యు మెహతాకొక లోపము కనబడుచున్నది. ఆతనికేదియో తనభార్యలోతక్కువగా కనుపించుచున్నది—సంపూర్ణమగు సంతృప్తివానిహృదయములో లేదు—అందులకుకారణము!

అతనికి జీవితము తీవ్రముగనున్నది—అసంతృప్తినే మొత్తము మీఁద కలిగించుచున్నది.

ఆతనికి—న రకములోఁగూడ నంతగా సంతోషము కలుగుట లేదు—ఆతని తండ్రివలననే, ఆరంభములలోనోడ వర్తకముస్థాపింపబడినది. తనతండ్రివలన నున్నత దశలోనికి తీసికొనిరాబడిన భాగస్థులు తన్ననహ్యముగా చూచుచున్నారని ఆతడు తెలిసికొని, మనస్సులో అలజడినిపొందెను.

ఆతనికి గౌరవమునకు కొదువలేదు—ఇంటిలో భార్య అమితగౌరవమునుజూపుచున్నది—ఇఁక సంతోషకరములగు నాటకములను, సినిమాలను దర్శించుటకు యిష్టములేదు—వెల్లింగ్డన్ టాకీస్‌కొత్తగా వచ్చిన ఫిలిమేదయిన నాతడుచూడకమానఁడు. అప్పుడప్పుడు హార్సురేసెస్‌కు వెళ్ళుచుండును, గోహార్‌తో కలసి, వారమున కొకసర్యాయము భుజించుచుండును. ఆమెతో బాతాఖానీ వేయుచుండును. సాధారణము గాక్లబ్బులకు వెళ్లుచుండును.

ఇన్ని చేయుచున్నను—ఆతనికిసంతృప్తి లేదు—సౌఖ్యముఁ కనబడుట లేదు జీవితమంతయదార్ధముగానుండరాదని తలంచి, ఆతఁడప్పుడప్పుడు తనలోతానేభయపడుచుండును—గులాబ్ మరల నాతనికంట బడలేదు—ఒకవేళనాతని యసంతృప్తికి ఆమె హేతువై యుండఁనేమో!

ఖుదీరామ్ మెహతాకు—అకస్మికముగా వింతయాలోచనలు పొడసూపుచున్నవి. తానొకవేళ, రేపుచనిపోవచ్చును—చనిపోయెననియే నిశ్చయించుకొన్న యెడల నేమగును! ఈప్రపంచములో తన మరణమునుగురించి, విచారించువారెవ్వరున్నారు! గోహారు......ఆమెమాత్రమేమి చేయును? కన్నీరుఁగార్చును. ఎంతకాలము? కొన్నిదినములు; లేక......కొన్ని నెలలు......పిమ్మట? వేరొకని బెండ్లాడును. ఎవ్వరినోఁ అననేల? తనకు ముగ్గురు స్నేహితులున్నారు...వారిలో నొకని

బెండ్లాడును—తనమరణమునకయిదు సంవత్సరములు గడచినపిమ్మట ఆమె కంటనీరయిన బెట్టవలసిన అవసరములేదు—నిట్టూర్పయిన విడువనక్కఱలేదు......

ఇఁకఁదన భాగస్థులా! వారికేమి? చదరంగమున రాజుకట్టువడుటతోనే ఆటకట్టువడినది—గెలిచినవాడు సంతోషించును.

అదేవిధముగా వర్తకమునుండి తానుపోయినంతనే—తనభాగస్థులు సంతోషింతురు—శనివదలిపోయినట్లు తలంతురు? .........
వారు తన్నుగురించి ఎందులకు విచారింతురు?

ఇఁకఁదాననుందినము పోవుచున్న క్లబ్బులా? క్లబ్బురిజిష్టరులో తనపేరు కొట్టివేయఁబడును.... మొత్తముమీఁద నేవిధముగాచూచినను, తనమరణమును గురించి విచారించువారులేరు—తనఅనంతరమందు జ్ఞాపకచిహ్నమును నిలుపువారులేరు—తనజీవితము ప్రపంచమునకు నిరుపయోగముగను నిరర్థకముగను ఉండుటచేతనే—ఒకవేళ రేపుతాను మరణించినను, తనమరణముగూడ ప్రపంచమునకు నష్టముగా పరిగణింపబడదు.........

తనజీవితము ప్రపంచచరిత్రలో ప్రాముఖ్యము వహింపవలయునన్నను—తనపేరు ప్రతివారికి చిరపరిచితముగా నుండవలయునన్నను-తనమరణము దేశమునకు తీరనికొరంతయై యుండవలయునన్నను-తాను ప్రపంచమునకు, దేశమునకు—ప్రాణికోటికి నుపయోగపడవలయును అట్లుండుట కేమిచేయ వలయును?

అదియే ఆతనికుదయించిన ప్రశ్న! అదియే ఆతని ఆలోచనా సారము! అనఁగా—ఆతనిలో నున్న ఆశయములు పొడసూపుచున్నవి!

నిరర్థకముగా—నిరుపయోగముగా--బ్రతుకుటయన్నను, చనిపోవుటన్నను, ఆతనికి భయమును గలిగించుచున్నది. ఆభయమునకు

కారణమున్నది. ఖుదీరామ్ మెహతా—పెండ్లికి తొలినాటిరాత్రి—గులాబ్‌తో కలసియున్నపుడొక క్రొత్త విషయమును గనిపెట్టినాఁడు.

అతఁడేదియో యొకకార్యము చేయవలయునని అనుకొనుచున్నాఁడు. లోకములో నేదోవిధముగా ప్రాముఖ్యమును వహించుట కాతడువ్విళ్లూరుచున్నాడు.

ఆనాటి సాయంకాల మస్పష్టముగా గోహారుతో, మెహతా, తనమనోగతాభి ప్రాయములను చెప్పినాఁడు. ఆమెనవ్వినది.

"ఓయిభగవంతుడా! మీరేమిచేయగలరు?" అన్నది.

ఆప్రశ్న—లేక—ఆధోరణి మెహతాకించుక కోపమును కలిగించినది. ఆమెతన్నుగురించి ఆవిధముగా తలంచుచున్నదా యని ఆతడనుకొనెను.

అప్పుడుగోహార్—మెల్లగానాతని హస్తమును బట్టుకొని అదుముచు—"మీరిప్పుడు చేయుచున్నదిచాలదా? ఇంతకంటె నేమిచేయవలయును? జీవితమును సుఖప్రదముగా చేసికొనుటకు వలసిన వస్తువులను కొనుటకు మనకు తగినంత ధనమున్నది—మనకు—మోహన మెహతాయున్నాడు. మనతో గలసిమెలసి సంచరించుటకు స్నేహితులనేకులున్నారు—మీరుజాగ్రత్తగానిర్వహించుటకు వ్యాపారమున్నది ఇంతకంటె మనకేమి కావలయును? మీరేమిచేయగలరు!" అని ప్రశ్నించినది.

ఆమాటలను ఖుదీరామ్ మెహతా సంతోషపడలేదు—ఆమె "ఇంతకంటె మీరేమి చేయగలరు! అని సవాలుచేసినట్లు ఆతని బ్రశ్నించినది...ఆప్రశ్నలకు తగిన ప్రత్యుత్తర మాతడాలోచింపవలయును...అదియేవాని సంకల్పము.

ఆతఁడామరునాఁడా సమస్యను పూర్తిగా మరచిపోయినాడు. ఆసాయంకాల మాఫీసులో డైరెక్టర్ల మీటింగుచే నాతడక్కడకు

వెళ్ళెను. రాత్రియేడుగంటలవరకు నాతఁడక్కడే యుండెను. టెలిఫోను లో గోహారున బిలిచి—వర్తకసంబంధములగు విషయముల నొంటరిగా కూరుచుండి ఆలోచింపవలసియుండుటచే నాపూటకల్పబ్బునని, భోజనముకొరకు వెళ్ళుచున్నాననియు, క్షమింపుమనియుఁ జెప్పినాఁడు.

"మీయిష్టము—అటులనే కానిండు—" అని ఆమెబదులు చెప్పినది. అతఁడు రిసీవరును క్రిందఁబడవైచినాఁడు. అతఁడు అమెరికా వెళ్ళుచున్నాననిచెప్పినను, ఆమెతప్పక ఆవిధముగనే సమాధానమిచ్చునని తలంచెను.

ఖుదీరామ్‌మెహతా మేడయొక్క పైయంతస్తునుండి, లిఫ్టుద్వారా క్రిందకుదిగినాఁడు—పిమ్మట తనకొరకు వీథిలోనిలువఁబడియున్న కారు దగ్గరకు తొందరగా నడచిపోవుచున్నాడు. వసారాలో జనముక్రిక్కిరిసియుండుటచేత నాతఁడు వారినిదప్పించుకొని ముందుకుసాగిపోవుచు, హఠాత్తుగా నొకయువతితోఁడీకొనెను.

తోడనే ఆతఁడు తనతప్పిదమునెరిగి. వెనుకకుతగ్గి క్షమింపవేడుచు "ప్రమాదము—క్షమింపుఁడు—" అని పలికినాఁడు. ఆయువతియుక్త వయస్సులోనున్నది—సాయంతనము సామాన్యముగా స్త్రీలుధరించు దుస్తులను ధరించినది. ఆమెచిరునవ్వుతో—'పరవాలేదని' చెప్పునట్లొక పరిమోామెత్తి ఆతని బరికించినది. ఆసమయమున ఖుదీరామామెను జూచినాఁడు; అప్రయత్నముగా నాతనినోటినుండి సంతోష సూచకమగు కేకవెలువడినది; ఆతనికి నాకస్మికోద్రేకము కలిగినది. అతఁడాత్రముతో నామెచేతిని బట్టుకొని ముందుకు లాగినాఁడు—

"గులాబ్!"

అగును—ఆమె మిస్‌గులాబ్! తొల్లిటికంటె మిక్కిలి అందము గఁ గన్పట్టుచున్నది-ఆమెయొక్క చిరునవ్వునుజూచినను, ఆమెశరీరమును చేతితో స్పృశించినను-ఆతనిజీవితములో నద్భుతపరిణామము లుద

యించునేమో అన్నట్లాతఁడూహించు చుండెను. ఆమెలో గలిగిన తొట్రుపాటును గుఱుతించి ఆతఁడు బిగ్గరగా నవ్వుచు—ఆమెను తన కారు దగ్గరకుఁ దీసికొని పోయినాఁడు.

"ఏమి? గులాబ్! నీవిక్కడేమిచేయు చున్నావు?" అని ఆతడుబిగ్గరగా ప్రశ్నించెను. ఆమెతన వెడఁదకన్నులతో నాతని నొకపరి వీక్షించినది—ఆమె పెదవులపైనఁ జిరునవ్వు మొలకలెత్తినది.

"నేనా......" ఆమెనోటినుండి ప్రత్యుత్తరము నడిగావెలువడలేదు. ఇంచుకసేపామె ఆతురతపొందినది.—"నేనా?......ఇప్పుడే ఆఫీసునుండి వచ్చుచున్నాను......క్యావలెట్ హొటలునకు బయలు దేఱితిని—"

"భోజనమునకా! చిత్రము! అట్లయిన నీవిప్పుడుకూడ అక్కడేభోజనము చేయుచుంటివన్నమాట!"

ఆమెతలనించుక వంచి—ఆడించినది,......ఆమె, ప్రతిదినమును—సాయంకాలమప్పుడు—వాని ఆఫీసుగుండానే పోవుచుంటిననియు—ఆతనికొఱకేగదిలో దీపము వెలుగుచున్నదో-లేదో—చూచుట కూడఁదనకు తెలియుననియు చెప్పుటకు దనకు సాహసములేదనియెఱిగెను అంతేకాదు. క్యావలెట్ హొటలులోని సమాగమము వంటి సమాగమము కొరకే తానెదురుచూచుచు—ఆకారణముచేతనే అక్కడను భోజనముచేయుచున్నానని చెప్పుటకుగూడ నామె ప్రయత్నింపలేదు.

"అయిన......ఈ రాత్రి!......మనమిరువురము కలసి, అక్కడభుజింతము—. రమ్ము. లోనికిరమ్ము—" అనిపలుకుచు నాతఁడాత్రముతో నామె నొకపరి పరికించినాఁడు......ఆమెయించుకంత సందేహించుచున్నట్లు గమనించి, ఆతడు మరల... "నేనునీకు...పని పాడుచేయుచుండుట లేదుకదా?" అనిఅడిగెను.

"పనిపాటు చేయుటలేదు......కాని..."

"అటులయిన—రమ్ము—" అనుచు నాతడామెను కారులోనికి తోసి అందుకూరుచుండ జేసినాడు—కారునడచి పోవుచున్నపుడామె నాతడు వేయిప్రశ్నలు వైచినాడు. ఆమె వెనుకటి కంటెకొంచెము వయస్సులో పెద్దదయినది. ఆమెయిప్పుడుయౌవన దశలోనున్నది. ముందుకంటెనామెలో నిప్పుడందమెక్కుడుగా పొడసూపుచున్నది. సామాన్యముగాజవ్వనిము పైబడిన స్త్రీలందరిలోను కనుపించని ఆకర్షణ శక్తి ఆమెలో కనబడుచున్నది. ఆమెకిప్పు డిరువదియయిదు సంవత్సరముల కంటె ప్రాయ మెక్కువలేదు.

రెండు సంవత్సరములు! రెండు సంవత్సరములకు పూర్వము ఖుదీరామ్ మెహతా మిస్ గులాబ్‌ను జూచినాడు—కాని ఆతనికా రెండు సంవత్సరములును, రెండుయుగముల వలెనున్నది. ఆమె—హోటలులో నాతని మోములనిలువబడియున్నది. మౌనమవలంబించినది.

ఆనాడాయిరువురు గూరుచుండిన మేజాబల్లయే. అదృష్టవశాత్తు నేడుకూడ ఖాళీగానున్నది. ఆగదిలో వెనుకటివిధముగనే మిగతా వస్తువులన్నియు గనిపించుచున్నవి. మార్పేదియు గనబడుటలేదు. ఒకరికొకరెదురుగా నాయిరువురునుగూరుచుండిరి. గులాబ్ తనచేతులను ముందుకుచాచుకొని, బల్లనానుకొని కూరుచుండి, కాంతి పుంజములను వెదజల్లు తనవిశాల నేత్రముల నాతని దెసగురిచేయుచున్నది.

"బాగు—బాగు! ఆకస్మికముగా నీపూటగలసికొంటిమి" అని ఆతడు పట్టరాని సంతోషముతో ననెను.

"ఖుదీ......... నీవు.........నన్ను .........మరచిపోలేదా?"

ఆతడు తలను దిప్పినాడు.

"లేదు—ఎన్నటికినిమరచిపోలేను. నిన్నుమాత్రమేకాదు. మన

మిరువురము కలసి గడపిన ఆసాయంకాలము సైతము నేనుమరువ లేను......కాని—సంసారికజీవనమున్న దే......"

"నీవుసౌఖ్యముగనుంటివా!''

"ఆ—చాలవరకు...'' ఆప్రత్యుత్తరమాతనికే అపహ్యాము ను గలుగజేసినది; ఆమె మరలఁ గొన్ని విషయములను తర్కించి అడిగినప్పుడు—ఆతఁడించుక మనసు గుదుట పరచుకొనెను.

"ఓ—పెండ్లికి పూర్వము గోహార్ ప్రత్యేకించిన యింటిలోనే మేమిరువురము నివసించుచున్నాము—రెండుసంవత్సరము లయినది—అంతే!'' మాకొకపిల్ల వాఁడు—వానిపేరు మోహానమెహతా!''

ఖుదీరామ్ మెహతాచాలసేపటివరకు, ఆమెతో—తన గృహ విషయములను గురించి ముచ్చటించును—ఆతఁడును గోహారును గలసి వెళ్ళుచుండు ప్రదేశములను, వారిరువురు దర్శించు సినీమాలను నాటకములనుగుఱ్ఱపు పందెములను-ఆమెవానినోటినుండి ఆలకించినది. ఆతడామెకన్ని విషయములను జెప్పినాడు-తనకథను పూర్తిగాముగించువఱకు ను, అందుసారము శూన్యమనుమాట నాతడు గ్రహింపలేదు.

సంభాషణానంతరము—ఖుదీరామ్ మెహతా ఆర్కెష్ట్రా కండక్టరునకు వెయిటరుద్వారా ఒకకార్డునుపంపెను. తదుపరిట్యూనులననుసరించి, ఆతఁడామెతోఁ గలసి, డ్యాన్సుచేయుట కారంభించెను. డ్యాన్సుచేయుచున్నంతసేపును—ఆమెకరగిన చూడ్కులనాతనిపైఁ బ్రసరించుచునే యున్నది. ఆతఁడుమాత్రమామె నేత్రములలో గోచరించుచున్న దైన్యమును గమనింపలేదు—ఆమెలో వ్యక్తపడుచున్న సౌందర్యమునుజూచి మెచ్చుకొనుచుండెను. చంటిపిల్లవానివలె నామెబాహువులలో-నాతడాశ్చర్యకరమగు సౌఖ్యమును నాసమయమందనుభవించుచుండెను. అట్టిసౌఖ్యమువెనుక, రెండుసంవత్సరములకు పూర్వ

మామెతో నున్నప్పుడే ఆతఁడు పొందఁగలిగెను. —మరల నాఁటికి నేఁడు!

డ్యాన్సుముగియుటతోనే, ఇరువురును మేజాబల్లకడకు వచ్చిరి. —తేనీరు త్రాగుచునాతఁడు-"హనీమూను క్లబ్బునకు పోవుదమా?" అనిఆమెను బ్రశ్నించెను—

"ఆక్లబ్బు మూయఁబడియున్నది."—ఆమె అప్పుడు తన తీర్పు నకువ్యతిరిక్తముగా నోరు విప్పిచెప్పఁ దలంచెను-రెండుసంవత్సరముల జీవములో నారాత్రియే ఆమెకు ప్రాణమున్నది—ఆరాత్రియే ఆమెకు సుఖప్రదమయినది—ఆతనితో నొంటిరిగా మాటలాడుటకామె కుతూహాలపడుచున్నది. ఆతనిఁ దానమితముగఁ గోరుచుంటిననిి తెలుపుటకు వేగిర పడుచున్నది.

"మామేడమీఁదికి పోవుదము—ఖుదీ! అక్కడనీవు—నాకుఅన్నివిషయములను జక్కఁగా చెప్పవచ్చును; నిన్నుగురించివిశేషముగా తెలిసికొనుటకు నేనుత్సహించు చున్నాను—."

ఆమె యాహ్వాన మాతనికమిత సంతోషమును గలిగించినది ఆమెతోఁగూడ హొటలునువిడిచి—ఆమెనివసించుచున్న మేడ మీఁదికి పోయి గదిలో ప్రవేశించినాఁడు.

తాను రెండుసంవత్సరములకు పూర్వము చూచినరీతినే— ఆగదియు నందలి సామానులును నేడుకూడ నున్నవి. నాఁటిప్రశాంతత యే నేఁడుకూడఁ గనఁబడుచున్నది—తన్నాగది ఆహ్వానించుచు— తనరాకకొఱ కెదురుసూచు చున్నట్లున్నదని ఆతఁడూహించెను-

ఆయిరువురును సోఫామీఁదఁ గూరుచుండిరి. విధివిరామములు లేకుండ నాతఁడు మాటలాడుచునే యుండెను. ఆమె వానినొరణినరి కట్టలేదు—వంచింపఁబడలేదు. రెండు సంవత్సరములక్రింద—ఆనాఁటి రాత్రియే ఆమెఆతనికి సత్యమెరిఁగించినది.

ఆమె—అతనిఁ బ్రేమించినది—త్రికరణశుద్ధిగా ప్రేమించినది—ఆనాఁటిరాత్రి ఆమెకు హృదయములో నుదయించిన ప్రేమయే నేఁటి వరకామెను పాలించినది—ఇకముందుఁగూఁడ పాలింపనున్నది. ఆమె జీవితమంతయు ప్రేమమయము—ఆప్రేమ ప్రతిఫలమును గోరలేదు- అందుకొరకు పన్నుగడలను పన్నుటలేదు. ఆప్రేమయే ఆమెను—స్నేహితులనుండియు—లోకమునుండియు వేరుచేసినది—ఆమెనేకాఁకి గావించినది. ఆమె నొంటరిగా సుఖముండునట్లు చేయుచున్నది.

ఆతఁడు—తన్నుగురించి—ఆమెకుఁ దెలియనివిషయము లేవియు చెప్పుటలేదు. ఆమె ఆతనిమాటల నాలకించినది—అందలియుదాగ్ధమును బ్రేమించినది. ఆమె—దూరమునుండి ఆతని నెల్లప్పుడును బ్రశంసించుచునే యున్నది. ఆతని నీడను బ్రేమించుచునే యున్నది. అనుదినము—ఆఫీసున కాతఁడెప్పుడు వచ్చుచున్నాడో-ఆఫీసునుండి ఎప్పుడు తిరిగి వెళ్ళిపోవుచున్నాడో—ఆమె యెరుగును—ప్రతిసాయంతనము ఆఫీసులో పనిముగియుటతోనే—ఆమె ఆతని ఆఫీసుప్రక్కనుండియే పోవుచుండును—పోవుచున్నపుడు—ఆతనిగదివంక తనచూడ్కులను బ్రసరించుచునే యుండును-గదిలోనాతని చాయను దూరమునుండి చూచినంతమాత్రముననే, ఆమెసంతోషించుచుండును—ఆతని ననేక పర్యాయములామె దూరమునుండి చూచినది-కానినేటి సమాగమ మాకస్మికమయినదగుటచే ఆమె యింతసేపటివరకును భయపడుచునే యున్నది.

ఇప్పుడామె—మరలనాతనిదర్శించి—ఆతనిచెంతఁ గూరుచుండ గలిగినందుల కాశ్చర్యమందినది—అమితముగా సంతోషము పొందినది

ఖుదీరామ్—తాను సుఖముగా జీవించుచున్నానని చెప్పినాఁడు అంతలోనే ఆతడు—తనకు సంసారసంబంధమగు సౌఖ్యమునకు కొరంత గోరంతయు లేదనియు........కాని తనజీవితములో సంతృప్తి—సౌఖ్యము అనునవి రెండుమాత్రము గోచరించుట లేదనియుఁజెప్పినాడు

ఆమెకథ అట్లుకాదు—ఆమె జీవితము పరిపూర్ణముగా నున్నది-ఆమె యొంటిరిగా—ఏకాకిగా—నివసించుచున్నను, సౌఖ్యమును, సంతృప్తిని అనుభవించుచున్నది. కాని అతఁడట్లుకాదు—అతని జీవితము నిస్సారమయినది.

అతఁడామె నుత్సాహముతోను, ప్రశంసాభావముతోను పరికించుచుఁ దనమనోగతాభిప్రాయము నామెకు వెలిబుచ్చెను. "గులాబ్! లోకులు మేము సర్వవిధములఁ జేను ధన్యులమనియు, మాకేవిధమగు కొరంతయు లేదనియు చెప్పుచుందురు—కాని......నేను, వాస్తవము చెప్పవలసి వచ్చినచో—సుఖపడు చుండుటలేదు. నాకీవిధమగు జీవితము నిరర్థకమువలెఁ గన్పట్టుచున్నది—ఈబ్రతుకు నిస్సారమువలెఁ దోఁచుచున్నది—"

"కాని—ఖుదీ! నీభార్యనిన్నుఁ బ్రేమించుచున్నది"—అని ఆమె నుడివెను.

అతఁడామాట కదిరిపడెను—నిరుత్సాహముతో—అశాంతితో అసౌఖ్యముగా నాతఁడు తనదృష్టిని ప్రక్కకు మరల్చెను.

"అగును—నేనామెను ప్రేమించినట్లే—ఆమె నన్నును బ్రేమించుచున్నది. ఆప్రేమయొకదానిని బాధచేయదు; వేరొకదానిని గోరదు అందుచేతనే—గులాబ్! ఆప్రేమనాకు, సంతోషకరముగాలేదు-ప్రేమయను వస్తువుకతమున కొన్నివస్తువులు పాడుగానలయును. నిరుపయోగమునకుఁగాని—ప్రశంసకుఁగాని నేను అదేపనిగా గురికాఁగూడదు. కొన్నికార్యములను నేనుచేయవలయును—కొంతమార్పుతో నేను బ్రతుకవలయును—అదియేనా ఆశయము.

ఆమె అతనిమాటల నాలకించినది—అందలి యదార్థమును గురుతించినది. అతఁడిట్టి యాశయములతో నున్నాఁడని, ఆమె రెండు సంవత్సరములకు పూర్వమే తెలుసుకొన్నది—అందుచేతనే—అతఁడు సా

ఖ్యమునే కోరినయెడల దన్ను మరల దర్శింపకుండ నుండవలయునని ఆమె అప్పుడే అనుకొన్నది.

ఆమె తనహృదయములో గలిగిన ఆందోళమును గప్పిపుచ్చుటకై—మందహాస మొకపరి కావించినది.

“అయిన నీవేకార్యమయిన నెందులకుచేయవు?” అను ప్రశ్న మామెనోటినుండి వెలువడినది.

ఆతఁడు తెల్లబోయి-ఆమెముఖమును బరికించుచుండెను-గులాబ్ నోటినుండి వెలువడిన ఆప్రశ్న సహజమై, ఆతనికి సిగ్గునుగలిగించినది.

“కాని—ఏమిచేయవలయును?” అని ఆతఁడు మెల్లఁగా నడిగెను—మరల నాతనిదృష్టి ప్రక్కకు మరల్పఁబడినది.

“తెలియదు—గులాబ్! ఏమిచేయుటకును నాకుతెలియదు—నామెదడు పాడయినది; నాకుబద్ధక మెక్కుడయినది......కాని...కార్పొరేషన్ వంక నాబుద్ధి పరుగిడుచున్నది—ఈరోజులలో నభిప్రాయములతో గూడినయువకులు దేశమున కవసరము—కార్పొరేషన్లో గాని—లెజిస్లేటివ్ అసెంబ్లీలోఁగాని......” ఆతఁడు తనమాటను ముగింపలేదు—ఆమె ప్రేమపురస్సరముగా నాతనిచేతిని దనచేతితో నదుముసాఁగెను—

“ఏమి? ఖుదీ! నీకభిప్రాయములున్నవా! ఈనాఁడు దేశమున కుపకరించు క్లిష్టసమస్యలను పరిష్కరించుట కభిప్రాయములున్నవా? నిరుద్యోగ సమస్య మొదలగునవి అనేకములున్నవికదా!...” ఆమె కుత్సాహముదయించినది—ఆతఁడు తీవ్రముగా నామెవంకఁ జూడసాఁగెను; ఆతనికన్నులలో నాకస్మికముగా నొకజ్యోతి ఉదయించినది—ఆతఁడామె నుద్దేశించి, మాటలాడుటకు ప్రయత్నించెను. ఆతని హృదయమునుండి ఉత్సాహము—ఉద్రేకముకూడ పైకిపొంగి పొరలుచున్నవి.

"అగును—అదియొక ప్రధానవిషయమే! నేను—నావంటివనికి మాలినవాఁడు లేఁడని భావింపకుండినచో..." ఆమె ఆతనిచేయి పట్టుకొన్నది.

చెప్పు"-ఖుదీ! చెప్పు—వినుటకు నాకు కుతూహల మధికమగుచున్నది—" అని ఆమె ప్రార్థనా పూర్వకముగా నాతని బ్రతిమాలినది; ప్రోత్సహించినది.

"విను—గులాబ్! నీవు పేర్కొన్న సమస్య—అనఁగా నిరుద్యోగ సమస్య—ఈనాఁడు పరిష్కరించుటకు బహుక్లిష్టముగా నున్నది. ప్రతిదేశమందును, ప్రతిఖండమందును—నిరుద్యోగ పిశాచము ప్రబలుచున్నది—దానినరికట్టు సాధనము రాజకీయ వేత్తలకుఁ గనబడుటలేదు—ప్రత్యేకముగా, మనదేశములో—విశేషించి మనరాష్ట్రములో—నిరుద్యోగపిశాచము జనుల నెక్కుడుగా పీడించుచున్నది—ప్రభుత్వమువారు దీనిని చక్కబెట్టుటకు సరియయిన పద్ధతుల నవలంబించుటలేదు—ఒక్కపర్యాయ మమాంతముగా, నిరుద్యోగమును రూపుమాపవలయునని ప్రయత్నించినను, లాభములేదు—అట్లెన్నటికిని జరుగదు—ఆపని యెవ్వరికిని సాధ్యముకాదు—నిరుద్యోగమును కొంచెము కొంచెముగా తొలఁగించుచుండవలయును.

"గులాబ్! నేనొకప్పుడు హిందూదేశమంతయు, దిరిగివచ్చితిని ఒక రేవునుండి వేరొకరేవునకు పోయి—ప్రజలతో స్వయముగా, వారి కష్టసుఖములను గురించి—ప్రస్తావించితిని....

సింగరేణీ బొగ్గుగనుల నొక ఉద్యోగస్థుఁడు పరీక్ష చేయుచుండెను. ఆతఁడొకవారములో ప్రత్యేకముగా మూఁడుగనులను పరీక్షచేసి, వానినిమూయించినాఁడు. ఆగనులను మూయుటవలన నారాష్ట్రములో వారమున కయిదు వందలమంది కూలీలకు వ్యర్థముగా కూలి యివ్వవలసి వచ్చినది. కాని—డైరెక్టర్లు—ఆకూలీలకు పనిలేకున్నను, వారిని

మానిపించుట కంగీకరింపక—కూలిపూర్తిగా నిచ్చుటకు సమ్మతించిరి! పరిస్థితులు దేశములో నీవిధముగా నున్నవి! అక్కడక్కడ కూలీలకు చేయుటకు పనిలేదు—దేశమునందు నిరుద్యోగము ప్రబలినది......! ఆతడొకపరి నవ్వినాడు-మఱలఁదన ధోరణిని సాగించినాఁడు. ''గులాబ్! ఏమందువు? దేశము నానాఁటికి దారిద్ర్యమున మునిఁగిపోవుచున్నది. పట్టెడన్నము—కట్టుగుడ్డయులేక—ప్రజలు వాపోవుచున్నారు. సముద్రతీరములందున్న కొన్ని రేవు పట్టణములలో చేపలవర్తకము కూడ క్షీణించిపోవుచున్నది. ప్రజలసోమరితనమునకు సహాయము పడవలు చిన్నవి. అవి సముద్రజలముల మీఁద దూరప్రయాణమునకు పనికిరావు—చేఁపల వర్తకము వలన వేలకొలఁది ప్రజలు బ్రతుకవచ్చును—చేఁపల పరిశ్రమనభివృద్ధి పొందించుటకు ఇప్పుడున్న పడవలనుదీసివేసి, వానిస్థానమున పెద్దపెద్ద పడవలను నిర్మింపవలెను—కొన్నివేల రూపాయిల పెట్టుబడి అందులకు చాలును—కాని ఆపరిశ్రమ నిరుద్యోగమునఁగొంతవరకు బహిష్కరింపఁగలదు. ప్రభుత్వమువారిప్పట్ల శ్రద్ధతీసికొన్నచో.........''

"అగును—చెప్పుము—ఖుదీ! ప్రభుత్వమువారు శ్రద్ధతీసికొన్నచో......'' ఆమెఉత్సాహముతో, పట్టరాని సంతోషముతో నాతని నవలోకించుచున్నది.

''ప్రభుత్వమువారు శ్రద్ధతీసికొన్నచో—పెద్దపెద్ద పడవలు నిర్మింపఁబడఁగలవు—ప్రజలకు పని కలుగజేసి, వారిదారిద్ర్యమునడుగంటఁజేసి, వారిని ధనవంతులుగా జేయుటకవకాశము లనేకములున్నవి.'

ఆతఁడు చెప్పువిషయములనామె ఆత్రముతో నాలకించినది. ఆతని ఉపన్యాస ధోరణి మిక్కిలి గంభీరముగ నున్నది—అందు వ్యక్తిత్వము వ్యక్తమగుచున్నది. ఆతఁడామాటలను జెప్పునపుడులేచి, నిలువబడి—తాను వేలకొలంది జనులమధ్య నుపన్యాసవేదిక నధిష్టించి గంభీ

నముగా నుపన్యసించునట్లు—చిహ్నములను ప్రకటించినాఁడు. అతని మాటల తెన్నులో గాంభీర్యమున్నది—ఉత్సాహమున్నది—ఉద్రేకమున్నది!

అతఁడు తనమాటలను ముగించినపిమ్మట నా మొవైపు—ఒక తూరి తెల్లఁబోయిచూచెను. అతని కన్నెదుట నాసమయమున, మిస్. గులాబ్ కాక—వేరొక స్త్రీ యెవ్వతెయయిన నిలువఁబడి ఆలకించుచున్నచో—ఆతఁడు దిగులువడియుండెడివాఁడే! నిరుత్సాహముతో వెనుకంజవేసెడివాఁడే!

కాని—గులాబ్ నిలువఁబడియున్నది—ఆమెబుగ్గలెఱ్ఱఁబారినవి నేత్రములు వికసించినవి.

“ఖుదీ! నీవుచెప్పిన విషయములు బాగున్నవి—అవివాస్తవములు నీవు శాసనసభలోని కెందులకు ప్రవేశింపవు? శాసన సభాసభ్యుల మెదడులలోనికీ పన్నుగడల నెందుకు ప్రవేశపెట్టవు? నీవట్లుచేసిననాఁడు-దేశసేవ చేసినవాఁడవగుదువు—శాసన సభాసభ్యులకును, తన్మూలమున ప్రభుత్వమునకును—ప్రజలకునుగూడ విశేషముగు సహాయమాచరించిన వాఁడవగుదువు—ప్రస్తుతము నీమనసులో, నున్న పన్నుగడలు—క్రియారూపమును దాల్పవలయును. అందులకు నీవేల ప్రయత్నింపవు?”

అతఁడు తనచూపుల నామెపై నిలుకడఁజేసినాఁడు. ఆసమయమున వానిహృదయమునందు వింత వింత భావములు పొడసూపుచున్నవి—

“నీవు......నన్నా?......అడుగుచున్నావు? .....కానివారు వినరు...వారావిధముగా నెన్నటికిని చేయరు.”

ఆమె అతని హస్తమును బట్టుకొని తనవక్షము మీాదనుండ జేసినది—

"ఖుదీ! ఇట్టి ఊహలను శాసనసభలో చెప్పువాఁడు సామాన్య యువకుఁడుకాఁడు—చెప్పినచో—ప్రభుత్వమునకును, దేశమునకును ఉపకరించునిట్టి విషయముల నెందులకు వినరు? ఎందుల కాచరింపరు? నీవు ముందునకుదూకి, నడుముఁగట్టి—కార్యారంభమున కేలపని యత్నింపవు నీవీపని చేయఁగలవు...ఖుదీ! నీలోనట్టి శక్తి కలదు—"

ఇరువురును గూరుచుండి చాలసేపు మాటలాడుకొనిరి. ఆమాట వరుసవలన ఖుదీరామ్ మెహతాలో—ఉత్సాహము కొలఁదిగానున్నది—సాహసముమాట సందేహము—ఆత్మవిశ్వాసము మచ్చునకు మాత్రము కనఁబడుచున్నది—

గులాబ్ సర్వవిధములచేత —ఉద్రేక పూరితములగు మాటలతో నాతకి హెచ్చరికను గలుగఁ జేసినది—ఉత్సాహమును నెలకొల్పినది—సాహసమొసంగినది—పరిపూర్ణమగు ఆత్మవిశ్వాసమును గుదుటఁబరచినది. ఇంతయేల! ఆతనిలోఁ దాను ప్రవేశించినది. ఆతనిలోలేని ధైర్యసాహసోత్సాహముల నామె ఒసంగినది!

అందుచేతనే—ఆతని జీవితాధ్యాయములో నారాత్రిజరిగిన కథ మిక్కిలి రసవంతము!—మిక్కిలి ప్రాముఖ్యమయినది. ఖుదీరామ్ మెహతా ఆమె నభిలషించుచున్నాఁడు. ఆమెలో నాతని కనుపమానమగు వ్యక్తపడుచున్నది—ఆశక్తియే తనకూతక క్రియనిఆతఁడు దృఢముగ విశ్వసించెను—ఆతని హృదయములో నారాత్రి—ఆమెకతమున—నూతన పరిణామ ముదయించినది. ఆతఁడు వెనుకటి ఖుదీరామ్ మెహతాకాఁడు—ఇప్పుడు పూర్తిగా మారిపోయినాఁడు!

ఆమె సందేశమే తనకంగరక్షయనియు—ఆమె వచనమే తనకు తారకమంత్రమనియు నాతఁడు భావించినాఁడు.

ఈకార్యములన్నియు నాతఁడు తప్పక, చేయఁగలఁడని ఆమె వానికి నిరూపించినది. అంతేకాదు-వానిని నిర్వహించుట కాతడొక్కఁడే

తగిన యుపకుఁడనియు—భరతమాత అతని సహాయముకొరకు నిరీక్షించుచున్నదనియు—ప్రజాలాతని మీఁదనే ఆధారపడి యుండిరనియు హెచ్చరించినది.

శాసన సభాప్రవేశమాతనికి కష్టమయిన మాటకాదు-మిక్కిలి సులభమే! అతఁడు విశేషధనవంతుఁడు! ప్రాముఖ్యము వహించిన వర్తకుఁడు!

"చేసెదను—నీవు చెప్పినట్లు చేసెదను—గులాబ్!" అనుమాట లప్రయత్నముగా అతని నోటినుండి వెలువడినవి. అతఁడు పట్టరాని ఉత్సాహముఁదినాఁడు—ఆవేశములో నామెతనను బాహువులమధ్య బంధించినాఁడు.

ఆసమయమున-గులాబ్ తనబిగికౌఁగిటలో నున్న ఆసమయమున-ఖుదీరామ్ మెహతా-బాహ్యప్రపంచమును పూర్తిగా మరచిపోయినాఁడు. అతనికి మెదడులోను, హృదయములోనుగూడ ఆమెయొక్క తెయే నిలిచియున్నది. ఆమెనుగూర్చిన తలంపులొక్క నన్యములకవకాశమాతని మనస్సులో తావులేదు—ఆమె గులాబ్!—తనగులాబ్! తానామెను కోరుచున్నాఁడు—లోకములో నామెకంటె ప్రధానమగువస్తువు-ప్రియమగువస్తువు తనకు వేరొండులేదని ఆతఁడు గ్రహించినాఁడు. మరల నాఁటికినేఁడు! రెండుసంవత్సరములకుపూర్వ మానాఁటిరాత్రి—ఆమె తనకౌఁగిట నున్నది-మరల నేఁడున్నది! ఆరాత్రి తన హృదయములో విప్లవమును ప్రవేశపెట్టినది—మరలనేఁడు—మహత్తరమగు హెచ్చరికవలనఁ దనజీవితమును సఫలము గావించినది తనలో నింతవరకుఁగల నిరుపయోగతను నిరర్థకతను రూపుమాపినది—తనకామె కంటెనేమి కావలయును?—అని ఆతఁడాలోచించుచుండెను. ఆమెయే తనలో నున్న తాశయములను—సదభిప్రాయములను ప్రవేశపెట్టి దీపింపఁజేసినదని ఆతని తలంపు!

ఆమె ఆతని బాహువులలోఁ దన్నుఁదాను మరచియున్నది—తేజోవంతములగు ఆకన్నులను—ప్రేమరసార్ద్రమగు వక్షమును, దొండపండువలె నెర్రగనుండి తనలో మోహాతిరేకముం గలిగించిన పెదవులను—అతఁడు గాఢముగఁ దిలకించుచుండెను.

అతఁడా సమయమున—నిజమయినయువకుఁడు—గులాబ్ నిజమయినయువతి.........అతని యువతి! ఇతరములగు ఆలోచనములు వానిని బాధపెట్టుట లేదు.

అతడామెను గాఢముగఁ బ్రేమించినాఁడు—తనంతతానే, అతడేమియు చేయలేఁదు—ఏమిచేసినను గులాబ్ యొక్క సహాయముతో-ఆమెకొరకు మాత్రమేయని అతఁడు తెలిసికొనెను.

అతఁడు తన మోహోద్రేకము నించుకంత అరికట్టుటకు ప్రయత్నించినాఁడు—హృదయాంతర్భాగమునుండి పైకి ఉబుకుచున్న తన సందేశమునామె చెవులలో జొప్పించుట కుపక్రమించినాఁడు—

“గులాబ్! నీలో అనుపమానము—అద్వితీయమునగు మహత్తరశక్తియున్నది. నేనునిన్ను ప్రేమించితివి—తొల్లిఁటికంటె నెక్కుడుగా నిప్పుడు ప్రేమించితిని. నీతోడిదే నాకీలోకము నీకంటె వాంఛనీయమగు వస్తువు నాకొంకులేదు......నీవు నాదృక్పథమును, నాజీవితమునుగూడ మార్చితివి-ఆనాఁడు రెండు సంవత్సరములకు పూర్వము-ఆరాత్రి—నాలోనీవు ప్రవేశించితివి! నేఁడునన్ను పూర్తిగా సంస్కరించితివి .........నీవిన్ని దినములనుండియు, నాకొఱకు కనిపెట్టుకొని యున్నట్లు నేనూహించుచున్నాను. కర్మయే మరల మనసమావేశమునకు కారణభూతము.”

అతఁడు క్షణకాలమాఁగెను. పిమ్మట మరల గొంతుసవరించుకొని యిట్లనెను—

"గులాబ్! ఇదికర్మము—మనమిరువురము మరల నీరాత్రి ఈ విధముగాఁ గలసికొనుట యనునది విధివిధానము. నేనుసీకు బుద్ధిహీనుఁ డనై—వేరుగా నెఱిఁగింపనక్కరలేదు......గ్రహించితివా? గులాబ్! నీవు మరల నాకుకావలసియున్నది— నీకంటె ప్రియతమమగు పదార్థ మేదియునేను; కోరను. నీవు—నాకుసహాయమొనరించినయెడల నేనెట్టి కార్యమయిన సాధింపఁగలను—కావలయు. గులాబ్! నీసహాయము నాకు కావలయును. నేను......"

ఆమె మెల్లఁగా నాతని కౌఁగిలినుండి బయటకువచ్చినది-ఆమె నేత్రములలో ప్రతిఫలించుచున్న భావమును, లేక, సమాధానమును-అతఁడు గ్రహింపలేదు.

"ఖుదీ? సమయము మించిపోయినది"— అను మాటలామె నోటినుండి వెలువడినవి. అతఁడొకవేళ నెప్పుడయినఁ దన్నభిలషించినచో తాను—తనకొరకు గాకున్నను, అతని కొరకయిన ధైర్యమును, ఆత్మ విశ్వాసమును ప్రకటింపవలయును.

ఆమె—అతనిచేతికర్రను—సంచిని—మేజాబల్లమీఁద నుండి-బయటకు తీసి చేతఁబట్టుకొన్నది.

"ఖుదీ! నిన్ను-జూచితిని—నేను పరమానంద మనుభవించుచు న్నాను—నీవునాకు సౌఖ్యమునుకలుగఁజేసితివి—నీకుసహాయ మొనరిం పఁగలిగినందులకు నేను గర్వించుచున్నాను. ఖుదీ! నీవుమహత్తరములగు కార్యములను సాధింతువు......ఏమి సాధింపఁ బ్రయత్నింపవా?"

అతఁడామె చేతిలోనిసంచిని చేతికర్రను లాగుకొని క్రిందఁబడ వేసినాఁడు—మహోత్సాహముతో—ఇంతింతనరాని ఉద్రేకముతో ఆమెను దన బిగికౌఁగిటం జేర్చుకొనెను—చెక్కిళ్ళను—కన్నులను—కనురెప్పలను—కంఠమును—నాసికను-పెదవులను—వేయి పర్యాయ ములు-లక్షపర్యాయములు—కోటిపర్యాయములు—ముద్దిడుకొనెను

ఆతరుణమున నాతఁడామెపై గురిపించుచున్న ముద్దులవర్షమునకంతు లేదు!

"గులాబ్! నేనెట్టి దుర్ఘటకార్యములనయిన సాధింపఁగలను—కాని యొంటరిగా కాదు—నీవులేనిదే నేనేమియుచేయలేను; నీసహాయమున్నపుడే నేనెట్టికార్యములనయిన నిర్వహింతును—ఆరాత్రినిన్ను విడిచిపెట్టుట నాతెలివితక్కువ— నాబుద్ధిమాంద్యము—నాపొరపాటు మనయిరువురిలో నుదయించిన ప్రేమకు ధైర్యసాహసము లవరములు. ఆనాఁటిరాత్రి నాకుధైర్యసాహసములు లేకపోయినవి; నేనప్పుడు పిరికి పందను—

"కానియిప్పుడుకాదు—" అని ఆతఁడు మరలపలికెను.

"కాని—ఖుదీ! ఖుదీ!......దయచేసి......జ్ఞప్తి యందుంచుకొనుము—నీవు వివాహితుండవయితివి--నీయింటిని...నీకుమారుని... నీభార్యను......"

"నాకునీవు కావలయును—" అని ఆతఁడుగట్టిగా అఱచెను. క్షణములో నాతఁడు తానామెనేమి కోరుచున్నాఁడో తెలిసికొనెను—త్రికరణశుద్ధిగా—వర్ణనాతీతముగా—నిశ్చలముగా తన్ను ప్రేమించుచున్న ఆయువతియొక్క సర్వస్వమును దాను గోరుచున్నాననియుఁ—గోరుటయేకాని, ఆమెకు తిరిగి తానేమియు నిచ్చుటలేదనియు—ఆతఁడు గ్రహించెను. ఒకమాటలో చెప్పవలసివచ్చినచో—ఆతఁడామెను, ఆత్మత్యాగము చేయుమని కోరుచున్నాఁడు!

ఖుదీరామ్ మెహతా—వెనుకకు తగ్గి ఆమెరెండుచేతులను బట్టుకొని, దీనముగ నొకపరి నామెదెసఁ దిలకించినాఁడు—ఆతఁడు తన అసహాయతను వెలిబుచ్చుచు తలనూఁగించుచున్నాఁడు.

"కాని నేనామాట నడుగలేను—ఆవస్తువు నడుగుటకు నాకు హక్కులేదు." అని ఆతఁడు నుడివెను—ఆపలుకులు మిస్. గులాబ్

చెవులకు ములుకులయినవి—ఆమాట నామె సహింపలేదు. ఆమె ఆతనికొరకు బ్రతుకుచున్నది—ఆతఁడు లేకున్న నామెకు మనుగడ లేదు—సుఖము లేదు—సంతోషము లేదు. సర్వనాశనము! కనుక నా యదార్థమెరిగింపవలయును ఆతనికి యదార్థము నేఁడుగాకున్న రేపయిన —లేక మరొకప్పుడయిన నాతఁడాలకింపవలసినదే!

"ఖుదీ! నీకుహక్కున్నది—నన్ను గురించిన యావత్తు అధికారము నీకు చెందియున్నది. నేనునీదానను—నిన్ను బ్రేమించితిఁ. —నాటి రాత్రి మనమిరువురము గలసికొంటిమి—ఆక్షణమునుండియు నిన్ను ప్రేమించుచునేయున్నాను—ఖుదీ! ప్రతిదినము—ప్రతినిముషము— నీరూపము—నిన్ను గురించిన ప్రేమ—నాహృదయములో పాఁడఁగట్టు చున్నది. నాప్రేమయెట్టిదో నీవెరుగవు)......కాని—ఖుదీ! నా లో—నాజీవితములో—నా ప్రాణములో—నేనొక్కతెనే యుంటినని నీవు భావించుచున్నావా? కాదు—అట్లుకాదు—నాలో నీవుంటివి— నేను నీవు—నీవు నేను—కాని......ఖుదీ! నీభార్య......నీబిడ్డఁడు .........వారు నీవారు—వారిని ప్రేమించుట నీధర్మము"

ఆమెయింక మాటాడలేదు—ఆత డుద్రేకముతో మరల నామెను దనకౌగిటిలోనికి జేర్చుకొనెను—పారవశ్యముతో నొకరినొకరు కౌగిలించుకొనుచుండిరి......చుంబించుచుండిరి......ఆసమయమున నిశ్చల ప్రేమపాశబద్ధులగు నాయువతీయువకులనుభవించుచున్న ఆనందమునకు మేరలేదు—ఆమె తనప్రియుని బాహువులలో జిక్కువడి— తాను స్వర్గసుఖమననుభవించుచున్నట్లు తలంచినది. తుదకు—కొంత సేపయినపిమ్మట—ఆమె ధైర్యమును దెచ్చుకొని, వినయపూర్వకముగ నాతనిని వారించుచు—దూరముగ నిలువబడినది.

"ఖుదీ! నీవు వెళ్ళిపోవలయును" అను మాటలనామె అతికష్టము

మీాద నీరసముగా మందస్వరమునపలికినది. అతఁడామెను గాఢముగా ప్రేమించినాడు—అమెచెప్పినచొప్పున చేయుటయే అతనకిసమ్మతము.

వేడినిట్టూర్పులతోను—ఉద్రేకముతోను—ఆమె అతని విడుచుట కంగీకరించినది—ఖుదీరామ్‌మెహతా తనసంచిని, చేతికఱ్ఱను, క్రిందకువంగి అందుకొని—పోవుట కుద్యుక్తుఁడై మరల నామెహస్తము నదిమినాడు.

"గులాబ్! నీమాటను నేనాదరించుచున్నాను—ఇప్పుడునిన్ను విడిచి నేనువెళ్లిపోవుచున్నాను. కాని మరలవచ్చెదను—తప్పకవచ్చెదను—నీయొద్దకు రావలసియున్నది......కారణము నీవెరుగుదువు ......ఈరాత్రి మొదల్కొని నేనీమేడమీాదికి వచ్చుచునేయుండెదను. నన్నడ్డుపరచువారుగాని—మనప్రేమవాహిని నరికట్టువారుగాని ఎవ్వరును లేరని నీవువిశ్వసింపుము"

ఆమె తనముఖమును వంచుకొన్నది—ఆమెహస్తము ఎందుచేతనో కంపించినది—అతడు తెల్లబోయి నల్వంకల నొకపరితనదృక్కులను ప్రసరించెను—అతనిమెదడులోనికొక ఆలోచన అసమయమున జ్ఞప్తికివచ్చినది.

"గులాబ్! రేపుశుక్రవారము......శనివారాదివారములలో "నెరల్" వెళ్ళుటకు నేను నిశ్చయించుకొంటిని—నీవు నాతోరావలయును. రేపుసాయంకాలమే నేను కారుతోసిద్ధముగా నీయొద్దకు వచ్చెదను—మనమిరువురము బయలుదేరవలయును—"

ఆమె—ఆవేదనాసూచకములగు చూడ్కుల నాతనిపై నిగుడించినది—కాని, బెదవులను గదల్పలేదు.

"నేను—రేపుసాయంకాలము సరిగా ఏడుగంటలకు ప్రయాణమునకు సిద్ధముగానుందును—అప్పుడు టెలిఫోనులో నిన్ను పిలిచెదను—"

ఆమె అప్పుడుకూడ మారుపలుకలేదు—ఆతఁడు నిష్క్రమించెను. ఆతఁడు గదినివిడిచిపెట్టినపిమ్మట, తలుపుదెస కొంతసేపు పరికించినది—తరువాత సోఫాపైని కూలబడినది.

రేపురాత్రి......ఖుదీరామునకామె కాలయును......ఆమె ఆతనికేదోవిధముగా ప్రత్యుత్తరమిచ్చి యుండవలసినదని అనుకొన్నది. భయంకరమగు విషమావస్థ ఆమెకిప్పుడు సంప్రాప్తమయినది.

"ఖుదీరామ్—తన్నుఁబెండ్లాడడు—పెండ్లాడలేడు. ఎన్నటికిని ఆపనిజరుగదు. అయినను తన్నాతఁడు కోరుచున్నాడు. తానాతని గోరుచున్నది—తనజీవితమును, తనప్రాణమును, తుదకు తన సర్వస్వమును ఆతఁడు కోరుచున్నాఁడు"—అని ఆమె ఊహించినది.

రేపురాత్రి..............

ఆమె 'రేపురాత్రి'నిగురించి ఆలోచించుటకయిన నిష్టపడలేదు. కాని ప్రత్యుత్తరమప్పుడే హృదయములో నామెకు స్ఫురించినది. ఆ ప్రత్యుత్తరమప్పుడేకాదు—ఆమెకు మొదటినుండియు హృదయములో నున్నది. ఆయిరువురు సమావేశమైనప్పటినుండియు నాప్రత్యుత్తరమక్కడ ఉన్నది—అది జీవితాంతములకువరకు నక్కడుండును.

రేపురాత్రి............

ఆమె విసుగుదలతో విద్యుద్దీపముల నార్పివైచి—దుస్తులను మార్చి నిద్రించుటకు పడకగదిలోనికి పోయినది.

విషాదమునిండు ములు—ఆశ్చర్యకరములునగు స్వప్నములలో నామె గాఢనిద్రాసముద్రమున వహించినది.

---

## నాలుగవ పరిచ్ఛేదము.

మరుచటిదినము సాయంకాల మారుగంటల ముప్పదినిముషము లకు—ఖుదీరామ్ మెహతా యొక్క బండి, మిస్. గులాబ్ వసించుచున్న మేడముంగటనిలచినది. అతఁడు, బండిలోనుండి క్రిందకుదిగి, బండివానికద్దెనిచ్చిపంపివేసి, ఎలక్ట్రిక్ లిఫ్టుద్వారా మూడవ అంతస్తునుజేరినాఁడు. ఆమెయొక్క గదితలుపు నుద్రేకముతోఁ గ్రుద్దినాడు. అతఁడు రెండవపర్యాయము తలుపునుగట్టిగాగుద్దకముందే, మిస్. గులాబ్ తలుపునుదెరచి ఆతనిమోముంగఁ బ్రత్యక్షమయినది. ఆమెను దర్శించుటతోనే ఆతని ముఖము వికసించినది.

ఖుదీరామ్ మెహతా మిస్. గులాబ్ గదిలోఁ బ్రవేశించినవెనుక— తలుపుగదియమూసి—ఆమెపై తన దృక్కులను నిగుడించెను.

"గులాబ్! గులాబ్!............నీవేల మాఱుచెప్పలేదు? నేను సరిగా నాలుగుగంటలకు టెలిఫోనులో నిన్నుపిలిచితినిగదా? ఆఫీసును విడుచువరకు—ప్రతిమూఁడు నిముషములకు నిన్నుపిలుచుచునే యుంటినిగదా?" అనుప్రశ్న మాతనినోటినుండి వెలువడినది ఆమె తలయూచినది. ఆతనిచూపులలో తన చూపుఁ గలిపి, క్షణకాలమట్లె నిలువఁబడినది.

"అగును—నీవునిన్ను పిలిచితివని నేనెఱుంగుదును......రామ్! నేనిక్కడేయుంటిని"

"ఇక్కడేయుంటివా?.........అటులయిననాకేల ప్రత్యుత్తర మీయలేదు? గులాబ్! నామనసులోనాలోచనములనేకము లుత్పత్తిల్లినవి. సందేహములనేకములు పొడసూపినవి. ఎందుచేత నీవు ప్రత్యుత్తరమీయలేదు?" అని పలుకుచు నాతఁడామెను సమీపించినాఁడు. ఆసమయమున నాతనిమీదనున్న యుత్తరీయము క్రిందికిజారగుట ఆమె కనిపెట్టినది.

"నీవు సిద్ధముగనుంటివా?.........మనము బయలు దేరవచ్చునా?" అని ప్రశ్నించుచు నాతఁడామె చెక్కిళ్ళను ముద్దుపెట్టుకొనెను. ఆమె నేత్రములు కాంతిమంతములయి ప్రకాశించినవి.

"నేను టెలిఫోనులో నీకు ప్రత్యుత్తర మీయలేకపోతిని—నిన్ను నేను నమ్మకపోవుటయే అందులకు కారణము......ఖుదీ! నీ విక్కడకు రావలయుననియే నాతలంపు! గ్రహించితివా? అందుచే తనే నానిశ్చయమునునీకు..............."

"ఓహో! ఆలాగునా?" అనిపలుకుచు ఖుదీరామ్ మెహతా—ఆమెను తనకౌఁగిటఁ జేర్చుకొని, విధివిరామము లేకుండ నామెముఖముపై ముద్దులవర్షమును గురిసించెను. ఇంచుకసేపయిన పిమ్మట నామె ఆతని నాకార్యమునుండి వారించుచు—నవ్వుచు—దూరముగ పోయి నిలువఁబడినది.

"కారు వీథిలో సిద్ధముగనున్నదా?" అని ఆమె ప్రశ్నించినది. ఆతఁడు మందహాసమొనరించుచుఁ దలనాడించినాఁడు.

"ఈపాటికి నాకారు వచ్చియుండును; నేనుమాత్రమిక్కడికి బండిలో వచ్చితిని—" అని పలుకుచు నాతఁడు వసారాలోనికి వచ్చి చూచినాఁడు. చూచుపరికి క్రిందనొక మోటారుకారున్నది. "గులాబ్ కారువచ్చినది; సిద్ధముగనున్నది. రాత్రిపూఁట ప్రయాణము చేయుట నీకు సమ్మతమేనా?"

"నాకు సమ్మతమే! దయచేసి, నీవునాసూటుకేసును పట్టుకొనుము." ఆతఁడామె సూటుకేసును బట్టుకొనెను—ఇరువురును బయటకు వచ్చిరి. గులాబ్ తాళమువేయుటకుముందు—తనగదిని, మరలఁ నేనెప్పుడిందులో ప్రవేశింతునోయన్న ఆలోచనముతో పరికించినది.

ఇరువురును గారణములేకుండఁగనే—తమలోఁదామునవ్వుకొనుచు నెలక్ట్రిక్ లిఫ్టుద్వారా క్రిందకుదిగిరి. ప్రక్కనున్న సోడోపాపులో

రెండులైమ్‌జ్యూస్ బాటిల్సుతాగిరి. కారులోఁ గూరుచుండి గేటు వెస్టురోడ్డుగుండా ఆకారు ప్రయాణమును సాగించుచున్నది.

ఆకసమున చంద్రుఁడు ప్రశాంతుఁడై ప్రకాశించుచున్నాఁడు. పిండి ఆరఁబోసినట్లు దిక్కులన్నియు వెన్నెలవలన తెల్లగానున్నది. ఆరాత్రి సమయము నట్టివెన్నెలలో—ఖుదీరామ్‌మెహతా ప్రయాణము సేయుటకారంభించి, వర్ణనాతీతమగు సంతోషము ననుభవించుచున్నాఁడు.

మంచుగాని, జడిగాలిగాని, సోకకుండుటకై యొకపట్టుశాలువా నిరువురును గప్పుకొనియుండిరి—మనసులోని యుత్సాహమధికముగ నున్నట్లే వారికారు స్పీడుకూడ నధికముగనే యున్నది.

అర్ధరాత్రి యయినది—కారు "నెరల్" చేరుకొన్నది. మిస్. గులాబ్ గాఢనిద్రలో మునిగియున్నది.

ఖుదీరామ్‌మెహతా ఆమెను మేల్కొలిపినాఁడు — ఆమె తన వెడదకన్నులను విప్పి, ఒకపరి యాతనిని వీక్షించినది. అప్పట్లదానెక్కడనున్నదియు నామె యెరుఁగదు; కాని ఆచూపులలో నున్న భావమును మాత్రము మెహతా, తనజీవితాంతము వరకునుమరచిపోలేఁడు!

నెరల్ ప్రవేశించుటతోనే—మెహతా తన కారునాపుచేయలేదు. అక్కడకు 60 మైళ్ళదూరములోనున్న "బోలీపురము" సముద్రసమీపముననుండుటచేత నక్కడకు పోవలయునన్న కుతూహలమామెకెఱిఁగించినాఁడు. ఆమె ఆతని యభిప్రాయముతో నేకీభవించినది. నేత్రపర్వమొనరించు అపూర్వదృశ్యములను దిలకించుచు వారు—కారుతో సాఁగిపోవుచున్నారు.

ఉదయమయినది. బాలభానుని లేతకిరణము లప్పుడప్పుడే భూస్థలికి దిగుచున్నవి. పక్షులు తమగూండ్లను విడచి, పొట్టకొరకు యాతనపడవలసి యుండుటచేత బయలుదేరుచున్నవి. కారుపోవుచున్న ప్రదేశము పర్వతమయము—అట్లని దుర్గమముకాదు— కంటకావృతము-

కాదు—మనోహరమయినది—రమణీయమైనది! ముఖప్రక్షాళనమొనరింప వలసిన సమయమాసన్నమగుటచేత, ఖుదీరామ్‌మొహాతా—బాటకు ప్రక్కగానున్న యొకజలాశయమునొద్ద కారు నాపినాఁడు. గులాబ్! ఈగుంటలోనినీరు పరిశుభ్రముగానున్నది. మనము చుట్టుప్రక్కలందున్న వింతల నెల్లఁ గనుఁగొనుచుపోవుసరికి—సాయంకాలమగును. అప్పటికిగాని— బోలీపురమును జేరలేము. కారులో మనకు ఫ్లాస్కులో తేనీరున్నది; ఫలహారమున్నది నీవు ముందుగా నిందులోదిగి, స్నానము చేసిరమ్ము-రాత్రియంతయు కారులోనుండుటచేతఁ గలిగిన వేడి కొంత యుపశమించును; ప్రయాణపు బడలిక కొంత తీరును. అనియాతఁడామెతోపలికెను.

గులాబ్ ప్రథమమునఁ గొంతసేపు సంకోచించినది. తరువాత నాతఁడు చెప్పినచొప్పున, కారులోనుండిదిగి-ప్రక్కగానున్నగుంటలోనికిదిగినది. ఆతఁడు కారునాపుచేసి—చక్రమును బట్టుకొని కూరుచుండి, సిగరెట్టు కాల్చుకొనుచు పొగను మెల్లమెల్లగా పైకివదలుచుండెను. అయిదు నిముషములు గడచెను.

ఆమె తడిబట్టలతో కొంచెము చలిచేత వడకుచు, బయటకు వచ్చినది ఖుదీరామ్‌మొహాతా—ఆమెసూటుకేసును దెరచి, నూతన వస్త్రముల నామెకందించినాఁడు. ఆమె వానిని ధరించినది. మరల కారులో గూరుచున్నది.

కారుమెల్లగా సాగిపోవుచున్నది; చుట్టుప్రక్కలనున్న పలువిధ వృక్షలతాదులతోను—కొండలోయలతోను—వానిమధ్య మెలికలు తిరిగి ప్రవహించు సెలయేళ్ళతోను—ప్రకృతియంతయునుత్సాహకరముగానున్నది.

అప్పటికప్పుడే—సూర్యుఁడు తన ప్రచండ పరిపాలనమునకు స్వస్తి చెప్పి-ప్రశాంత స్వరూపుడై-పశ్చిమాద్రి నలంకరించుచున్నాడు-

సాంధ్యరాగము గగనతలమున నల్లడల నలముకొనియుంటచే వస్తువులన్నియు నెఱ్ఱబారినట్లు కన్పట్టుచున్నవి.

కారు—బోరీపురము ప్రవేశించినది—ఆగ్రామములో నొక చిన్నహోటలున్నది. హోటలుతాలూకు మోటారుషెడ్డులలో ఖుదీరామ్‌మెహతా—తనకారును నిలిపి—మిస్. గులాబ్‌తోగూడ లోనకు బ్రవేశించినాడు. హాలులో మేజాబల్ల నానుకొనియొక స్త్రీమూర్తి—(హోటలుగుమాస్తా) కునికిపాట్లు పడుచున్నది. ఖుదీరామ్‌మెహతా కాలింగ్‌బట్టన్ నొక్కుటతోనే ఆమె ఉలికిపడిలేచినది.

"అయ్యా! బసకావలయునా? మీ భార్యాభర్తలుండుటకు బస కావలయునా?" యని ఆమెప్రశ్నించినది.

మిస్. గులాబ్ ఆమాటనాలకించి, మారుపలుకలేదు. ఆమెకు పెదవులమీద మందహాస మంకురించినది.

ఖుదీరామ్‌మెహతా తలయూచినాఁడు. అతఁడు హోటలు గుమాస్తా నవలోకించి—

"ముందుగానీమేడలో నేయేగదులెక్కడెక్కడ ఖాళీగానున్నవో పట్టిచేసి నాకెఱిగింపుడు—" అనెను.

గుమాస్తా పట్టీని పరిశీలించి—

"అయ్యా! రెండవ యంతస్తున రెండు సింగల్ రూములున్నవి. మొదటి యంతస్తుమీద నొకడబుల్ రూమున్నది-" అనిమారుపలికెను.

ఖుదీరామ్‌మెహతా—ఒకపరి గులాబ్ ముఖమువంక తనదృక్కులను ప్రసరించినాఁడు. ఆమెలో నాశ్చర్యముగాని, విస్మయముగాని, ఆతురముగాని, వ్యాకులముగాని—లేక మఱెట్టిభావమును ఆతనికి గోచరింపలేదు. ఆమె ముఖమున ప్రశాంతత తాండవించుచున్నది. ఆమె అస్పష్టమగు మందహాసముతో నాతనిపైఁ దనదృక్కులను నిగుడించి, తలయూచినది. ఖుదీరామ్‌మెహతా, డబుల్ రూమును

బుచ్చుకొనెను. తరువాత నామెనొకపరి పరికించినాఁడు—

"నీవు సాయంకాలము దుస్తులతోనే యున్నావు—నేనుమీదికి పోయి—దుస్తులను మార్చుకొని వత్తును; తరువాత బీచికి షైరుపోన చ్చును......నీసూటుకేసులో నిప్పుడు నీకు కావలసిన వస్తువులేవయి ననున్నవా?" అని ఆమె ఆతనిం బ్రశ్నించినది.

ఆతఁడు తలద్రిప్పినాఁడు.తోడనే యామె హోటలునౌఖరునెత్తి మీఁద సామానులనుపెట్టి—బసను జేరుకొనుటకు మేడమెట్లనెక్కుచుం డుట ఆతఁడు చూచుచున్నాఁడు. ఆహా! మిస్ గులాబొక ఆటవస్తువు నంటిదికదా? ఆమెలో గించిత్తయిన ఆత్రముతేదు! కాని అదియే ఆవి ధముగా నుభయులు గలసియుండుటకు మొదటిపర్యాయము!

ఆమె మేడనుండి దిగివచ్చినది—"మన మింక పోవచ్చునా? కొంచెము తేనీటిని త్రాగుదువా?" అని ప్రశ్నించినది.

"నిజముయిన యాడుది—స్త్రీత్వము సమగ్రముగా నీమెలో నున్నది— వింతయయిన యాటవస్తువువలెనున్నది—" అనిఖుదీరామ్ తనలోఁ దానను కొని, ఆమె ప్రశ్నకుఁ దలయూచినాఁడు.

ఇరువురును ఆప్రశాంత సమయములో—ఆసాంధ్యవాగములో—ఆమందానిలములో—సముద్రతీరమునకు షికారు బయలుదేరిరి. సము ద్రతీరమునం దొకచోట గొందరు జాలరులు చేఁపలనుబట్టుచుండఁగా—ఆశ్చర్యోత్సాహములతో ఖుదీరామ్‌మెహతా నిలువఁబడి పరికించు చుండెను.

పరిసరమునందిసుక తిన్నెపై మిస్. గులాబ్ ఆసీనయైయున్నది. ఆమెసూడ్కులు—ప్రియుఁడగు ఖుదీరామ్‌మెహతాపై నిగుడింపఁబడి యున్నవి. ఆమె హృదయము మాటిమాటికిని ఆతనివంకకే పరుగెత్తు చున్నవి. ఆతనిగురించిన యాలోచనములకు తప్ప—ఇతర విషయముల కప్పట్ల నామె మెదడులో తావులేదు. తాన తనినెంత గాఢముగ బ్రే

మించితినోయని యామె యనుకొనుచున్నది. ఆముహూర్తమునందాన నుభవించుచున్న యానందము—మందాకినీ పరిసరసైకతశ్రేణుల యందు విహరించు దేవకన్యకలయిన ననుభవించి యుండరని ఆమె విశ్వసించుచున్నది. అగాధము—అనంతము—అపూర్వము, అనుపమానమునగు ప్రేమతో నామె యాతనిం బ్రేమించుచుండుటచేత—ఆతనితోడిదే లోకమన్నట్లున్నది!

యదార్థము చెప్పవలసివచ్చిన—సౌఖ్యమనఁగా నట్టిదేయనియు జీవితములో నట్టిసౌఖ్యమునే తానభిలషించుచు, దానికొరకే యెదురు చూచుచున్నాననియు నామె యనుకొనుచున్నది!

ఆరాత్రి చాలసేపయిన పిమ్మట నాయిరువురును హోటలునకు తిరిగివచ్చి, భోజనమాచరించిరి. తరువాత నాతఁడు సిగరెట్టు కాల్చుకొనుచు, మెల్లమెల్లగా పొగనూదుచు నామెనవలోకించి—"గులాబ్! మరల మనమీ వెన్నెలలో షైరుపోవుదమా?"అని ప్రశ్నించినాఁడు.

ఆమె మందహాస మొనరించినది.

"నీకుకూడ చేపలను బట్టవలయునన్న యుత్సాహమున్నదా?" అనియామె అడిగినది

"నేను......నీవేమిచెప్పిన నదిచేయఁగలను"

"నీవు చేపలనుపట్టుము—నీవు ఎరనువేసి, ఆయెరకు సాలమన్ చేప దొరకనప్పుడు—మొగమెట్లు పెట్టెదవో చూడవలయునని యున్నది."

ఆతఁడు నవ్వుచు దలను ద్రిప్పినాఁడు; హఠాత్తుగా నామెచేతిని బట్టుకొని ప్రేమపూర్వకముగా నదుము నారంభించినాఁడు.

"గులాబ్! నేను నిన్నెంతగా ప్రేమించితినోకదా" అనుమాటలప్పట్ల అప్రయత్నముగా నాతనినోటినుండి వెలువడినవి.

అట్టిమాటలను వినుటకే ఆమె కుతూహలపడుచున్నది.

"ఖుదీ! నీవునన్ను ప్రేమించుచున్నావా? ఎన్నటికిని—ఏమిసంభవించినను నన్ను ప్రేమించుచునేయుందువా?" అని ప్రశ్నించినది.

"ఎప్పటికిని—ఎన్నటికిని ప్రేమించుచునే యుందును."

ఆమె యొకనిట్టూర్పు పుచ్చినది. ఆనిట్టూర్పుతో హృదయభారము కొంతతగ్గినట్లయినది. ఆమెకిప్పుడు విస్పష్టమగు పథమనుసరించుటకు దొరకినట్లయినది. ఆపథమున మాయలేదు—మోసములేదు!

ఆపథము త్యాగము నుద్బోధించును.

"ఖుదీ! రమ్ము—మనమిరువురము బీచికిపోవుదము—చేపలను పట్టుటలో నీకు నైపుణ్యమున్నదో లేదో పరికింతును—" అని ఆమె ఆతనినావెన్నెలలో మరలఁ దీసికొనిపోయినది.

కొంతసేపు బీచి యిరువురును గలసితిరిగిరి. ఖుదీరామ్ మెహతా చేపలను బట్టుట కుత్సాహమును జూపించినాఁడు. కాని, కృతకృత్యుఁడు కాలేదు. అక్కడనుండి బోరీపురములోని పల్లెలను, అక్కడి ప్రజలను జూడవలయునన్న వాంఛ యాతనికి పొడమినది.

"గులాబ్! నేనుపోయి గ్రామమంతయు నొకపర్యాయముచూచి త్వరలోనే వచ్చెదను. నీవు మనబసలోనికిపొమ్ము—" అని ఆతఁడామెతోననెను.

"నేనుకూడ వచ్చెదను—పల్లెటూరిజీవన మెట్లుండునో చూచుటయన్న నాకు సంతోషప్రదము—" అన్నదామె.

"వలదు—ఇక్కడి ప్రజలు మోటువారు. వారికి మర్యాదగాని, గౌరవముగాని తెలియవు. బాటలు పరిశుభ్రముగానుండవు."

ఆమె పరిహాస సూచకముగా నొకపరి నవ్వినది.

'ఖుదీ! ఎల్లప్పుడును నీవెంటనుండుటయే నాకు సమ్మతము—నీవెక్కడకు వెళ్ళిన నక్కడకు వచ్చుటయే నాయభిమతము."

ఆతఁడింకేమని ప్రత్యుత్తరమీయఁగలఁడు? ఇరువురును—ఆచంద్రకాంతిలో—చల్లని పిల్లగాలి వీచుచుండగా—ఒకరిచేయి యింకొకరుపట్టుకొని—మందగమనముతో గ్రామములో ప్రవేశించిరి.

ఖుదీరామ్‌మెహతా తలఁచిన ప్రకారము గ్రామస్థులు మోటువారుకారు—తమవైపు ఒక చక్కనియువతి వచ్చుచున్నదనుటతోనే-సగౌరవముగ కొందరులేచి నిలువఁబడిరి. కొందరు కూరుచుండుటకు పీటలను దెచ్చివేసిరి. మరికొందరు—నవ్వుచు నామెతో కాలక్షేపము నకుపక్రమించిరి. ఎన్ని సంవత్సరములనుండియో తనకు వారితో పరిచయమున్నట్లుగా—గులాబ్ ఆగ్రామస్థులతో ముచ్చటించినది. ఆమెలో గల కలుపుగోలుతనమునకు ఖుదీరామ్‌మెహతా ఆశ్చర్యపడినాఁడు. ఆశ్చర్యపడుట మాత్రమేకాదు. మధ్యమధ్య నామెనధికముగా ప్రశంసించినాఁడు.

అప్పటికి రాత్రి పదిగంటలయినది. గ్రామపరిశీలనమును ముగించి యిరువురును మగిడి హోటలులోనికి వచ్చిరి. మేడమీఁద హాలులో నొకపెద్దమనుష్యుఁడు కూరుచుండియుండెను. ఆతఁడు ఖుదీరామ్‌మెహతాయొక్క దుస్తులను రెప్పవేయకుండ పరికించి—

"ఓహో! మీరు సరదాకు చేపలను బట్టబోయియుండిరా? అని ప్రశ్నించినాడు.

గులాబ్ ఆతని చేతిని విడిచిపెట్టినది— "ఒకగ్లాసు తేనీరుత్రాగుము—కావలసిన రెండుగ్లాసులు త్రాగుము—" అని పలుకుచు, సెర్వెంటునకు తేనీటి కొరకాజ్ఞాపించి—ఆమె పడిగాతన గదిలోనికిపోయి దుస్తులనుమార్చి, మరల నీవలకువచ్చి—ఆతని ప్రక్కనున్న యొక కుర్చీలో కూలఁబడినది.

"అయ్యో! అదృష్టమేమియులేదు—చేపలేవియు దొరకలేదు-ఊరకే సంతోషమునకు పోయితిని-" అని అప్పుడుఖుదీరామ్‌మెహతా

ఆపెద్దమనుష్యునకు ప్రత్యుత్తరమిచ్చినాడు. అతఁడు, సెర్వరుతెచ్చి తనమ్రోలపెట్టిన తేనీటిని కొంచెముకొంచెముగా త్రాగుచు—

"అయ్యా! మీరో?" అని ప్రశ్నించినాఁడు.

"నేనిదివరలో చేపలనుబట్టుసరదాతో పోయెడివాఁడను కాని యిరువదిసంవత్సరములనుండి సంతోషమును విరమించుకొంటిని—ఇతరులు స్నేహితులువచ్చువరకు నాగి, ఆపాటులన్నియు నెవ్వరుపడుదురు?" అనుమాట లాపెద్దమనుష్యుని నోటినుండి వెలువడి ప్రత్యుత్తరరూపమును దాల్చినవి.

ఖుదీరామ్‌మెహతా నవ్వినాడు—ఆతఁడు తనగదిలో నున్నగడియారముదెస అసహనముతో తనదృక్కులను బుత్తెంచినాడు. సరిగా నాసమయమున, గులాబ్ కుర్చీనుండిలేచి గదిలోనికిపోయినది.

ఎంతత్వరలో గదిలోనికిపోయి ఆమెనుగలసికొందునాయని ఆఁతఁడాలోచించుచుండెను. ఆకస్మికముగా నాతనిహృదయములో గోహార్ ప్రవేశించినది. ఆరాత్రివంటి మరియొకరాత్రి (హనీమూను—రాత్రి) యాతనిక్ష దడులో గన్పట్టినది.

ఆదియంతయు వేరొకప్రపంచమువలె వానికిదోచినది. ఆతడిక గులాబ్ నెన్నఁడును గలసికొనలేడు—సరికదా! ఎన్నటికిని గోహారును విడువలేఁడు. గోహారు ఆతనిభార్య కాని—గులాబ్? ఆమెయు నాతని భార్యయే! ఒక్కభార్యమాత్రమేకాదు. ఆతనిప్రేమ—ఉద్రేకము—ఉత్సాహము—సంతోషము—సర్వమునామెయే! ఆమెతోడిదే యాతనికి జీవితము.

కొన్ని నిముషములుగడచినవి. ఖుదీరామ్‌మెహతా లేచినిలువఁబడినాడు—మరల నొకగ్లాసు తేనీటిని త్రాగినాడు.

"అయ్యా సెలవిప్పింపుడు—పోయినిద్రింతును—గతరాత్రి

యంతయు మాకునిద్రయే లేదు—" అని ఆతడు పెద్దమనుష్యునితో ననెను.

అప్పటికే కునికిపాట్లుపడుచున్న యాపెద్దమనుష్యుడు లేచి నిలువబడి 'చిత్త' మనిపలికినాడు.

ఖుదీరామ్ మెహతా—ముంగిలి హాలులోని కొకపర్యాయము వచ్చినాడు. దూరమునందు ఘోషించుచున్న సముద్రముదెస నొకపరి తనచూడ్కులను నిగుడించినాడు—ఆపరిపూర్ణచంద్రికలో సముద్రము వినీలజలములతోను—వెండిముద్దలనుపోలిన నురగలతోను—చూచుట కత్యంత మనోహరముగానున్నవి. ఆతడు తనగదినిసమీపించి తలుపును దెరచి లోనప్రవేశించినాడు. ఆసమయమున నాతనిహృదయములో లజ్జగాని—భయముగాని గోచరించుటలేదు. నూతనోత్తేజమెందు వానింగప్పివుచ్చుచున్నది. ఆదివరకెన్నడును గనివిని యెరుంగని యుద్రేకము—మోహము—వానిలో వ్యక్తపడుచున్నది. అందుచేతనే—ఆగదిలోప్రవేశించుట కాతనికి సంకోచము కలుగలేదు.

ఆతఁడు లోనఁబ్రవేశించి, తనవెనుక గదితలుపునుమూసి గడియబిగించినాడు. శయ్యయందాతని చూడ్కులు గురికాబడినవి. ఆమెలేచి నిలువబడినది. చిరునవ్వుతో గవాక్షమునుండి కాంతిశోభితుడగు చందురుడు వారింగాంచి నవ్వుచున్నట్లుండెను.

గులాబ్ గవాక్షమును సమీపించినది—దానిని గప్పియున్న తెరనుమూయుటకై యామెయొకచేయి పైకెత్తినది. ఆమెముఖమున జంద్రకాంతి విస్పష్టముగా ప్రతిఫలించుచున్నది.

ఖుదీరామ్ మెహతా క్షణకాలమువరకు చైతన్యములేని ప్రతిమవలె నిలువబడియుండెను. అప్పట్లనామెలోవ్యక్తపడుచున్న సోయగ మాతనిహృదయమును పూర్తిగహరించినది. ఆసమయమున నాతని శరీరమంతయు నుక్షిభూతమయినది. ముఖమునందు చెమ్మటలు మెండు

గాక్రమ్మినవి. చెప్పుటకుశక్యముకాని నూతనావస్థ ఆతనిలోఁ బ్రవేశించి నది. కామము—మోహము—ఉద్రేకము తొంగిచూచుచున్నవి.

"గులాబ్" అని ఆతడామెను సంబోధించినాడు—గులాబ్ ఆశ్చర్యమునుగాని—విస్మయమునుగాని వెలిపుచ్చలేదు. ఆమెలోగల గొప్పతనమదియే. ఎట్టివిషమావస్థయందయిన నామె ధైర్యమును విడు వదు—మనశ్శాంతిని గోల్పోవదు. ఆమె—తనమృదుహస్తము నా తని కందించుచు సమీపించినది.

ఆతఁడామెమెడ నొకచేతితో జుట్టినాడు. ఆమెయొకచేతితో నాతనిమెడజుట్టినది. కిటికీతెరమూయబడకుండుటచే నాయిరువురను బరి కించుటకు శీతానిలున కెవ్విధమయిన యాటంకములేదు—గులాబ్ కంపించినది.

"నీవు—ప్రేయసీ! కంపింపవలదు" అనుమాటలు ఖుదీరామ్ మొహతానోటినుండి వెలువడినవి.

"ఖుదీ! ఇదినరకెన్నడును బొందని—లేక యికముందెన్నడును పొందజాలని అనిర్వచనీయానందమిప్పుడే ననుభవించుచున్నాను. నేను నిద్రించుటకుముందీ రాత్రినేనెల్లప్పుడు జ్ఞప్తికి తెచ్చుకొనుచుందును. జీవితాంతమువరకు నాహృదయములో నీరాత్రియొక్కటే స్థిరనివాస మేర్పరచుకొని యుండగలదు..."

ఆమె ఆతనిచూపులలోఁ దనుచూపులంగలిపినది. ఆమెశరీర మించుకంతనాతనిదెసవ్రాలినది. ఆతఁడు ఖిన్నకుండలేదు. రెండుచేతు లతో నామెను గౌఁగిలించుకొనెను.

"ఖుదీ! ఈరాత్రియే ఈసంఘటనము జ్ఞప్తియందుండునని నీవు పొరబడవలదు—"

"ప్రేయసీ! ఎల్లప్పుడునుంచుకొనవలయును—నేనునిన్ను ప్రేమిం చుచున్నానని నీవెరుంగుదువా?"

ఆతడింక సహింపలేదు—మిన్నకుండలేదు. ఆమెనుదగ్గరగానది మిపెట్టి—తనపెదవులతో నామెపెదవులనుగలిపి, ముద్దిడుకొనెను—ఆతడువిధి విరామములు లేకుండ—ముద్దులవర్షమును గురిపించుచు న్నప్పుడును—బిగికౌగిటనుజేర్చినొక్కుచున్నపుడును—ఆమెసౌఖ్యాతిరేకమువలన మత్తుగొన్నది.

ఉచ్ఛ్వాస నిశ్వాసముల నరికట్టి—చిట్టచివర కాతఁడూఱకుండెను—ఆతనిచేతులు వదులయినవి, కానియామెను మాత్రమవి విడువలేదు. తీవ్రముగను—ఆశాపూర్వముగను—ఆమెదెసఁబరికించుచున్నాఁడు.

ఆతఁడామెతో నెల్లవేళల యందును ముచ్చటించుటకు గుతూహల పడుచుండును—ఆముచ్చటలోఁ గలమార్దవమును మధురత్వమును గ్రహించుటకామె యువ్విళులూరుచుండును.

ఆమె—మిక్కిలి వెచ్చగానున్న యాతనిహస్తమును బట్టుకొని దానితో తనచెక్కిళ్ళను స్పృశింపజేసి—పిమ్మట ముద్దుగొన్నది.

తరువాత నామెపర్యంకము మీదికి పోయినది......ఆతఁడామె ననుసరించినాఁడు.........

---

## ఐదవ ప్రకరణము.

---

సూర్యకాంతి కొంచెము కొంచెముగా మరునాఁటి ప్రాతఃకాలమున నాయిరువురు నిద్రించుచున్నగదిలోనికి ప్రసరించుచున్నది. గులాబ్ అదరిపడి నిద్రనుండి మేల్కాంచినది, బద్ధకమింకను ఆమెనువిడువలేదు. అప్పటి కాతఁడింకను దనప్రక్క నిద్రించుచునే యున్నాఁడు—అమె తనహస్తముతో నాతనిముఖమును స్పృశించినది.

రాత్రియంతయునామె—ఖుదీరామ్ మెహాతానే కలలోఁజూచుచున్నది. ఆతనిగురించిన స్వప్నములనే కాంచినది. ఆవిషయమొక పరిస్ఫురణకు వచ్చినంతనే—సుఖకరము. అనందమయమునకు మందహాసమూమె పెదవుల పైని దాండవించినది.

ప్రశాంతచిత్తముతో నామెఆతనిపక్క నిలువబడినది ఒకపర్యాయమువంగి ఆతని పెదవులతో. దన పెదవులను కలిపినది—తరువాత పర్యంకమును విడిచిపెట్టినది.

ఆమెతన దుస్తులనుమార్చి—పాదములను స్లిప్పర్సులో ప్రవేశపెట్టి, మెల్లగా సమీపించి— తలుపునుదెఱచినది. హోటలుసెర్వరు "టీ-ట్రే"తో నామెమోల ద్వారముకడఁ బ్రత్యక్షమైనాఁడు ఆమెయాట్రేనుండి యొకకప్పు తేనీటినందుకొని కొంచెము కొంచెముగా త్రాగినది. తరువాత సెర్వరునకు—నిద్రించుచున్న ఖుదీరామ్‌మెహాతాను చూపించుచు—

"పది నిముషములాగుము—లేకున్నగొంత సేపయినతరువాత తేనీటితో మరలరమ్ము. ఏమి?......నాకు బాతురూమును జూపింతువా?"అని, అడిగినది.

ఖుదీరామ్‌మెహాతా—కంగారుతో—తనబుజముల నెవ్వరోతట్టుటచేత నులికిపడి లేచినాఁడు. ఆతనిబుజముల నెవ్వరుతట్టిరి?...... మిస్. గులాబ్! చేతులతో తేనీటి కప్పులను పట్టుకొని—మందహాసముతోనామె యాతని కన్నులకు గన్పట్టినది.

"ఎనిమిది గంటలయినది.........తేనీరక్కరలేదా? స్వప్నములో నింకను సముద్రతీరమున చేపలనే పట్టుచున్నావా?"అని పరిహాసించుచు నామె ప్రశ్నించినది.

ఖుదీరామ్‌మెహాతా పెదవిగదల్పలేదు. ప్రత్యుత్తరమునకు బదులుగా మందహాస మొనరించినాఁడు. ప్రశంసాన్వితములగు దృక్కులనిం

చుకంతసేపు—ఆమెదెసకుఁ బుత్తెంచినాఁడు. తరువాతఁ దనకామె తేనీటికప్పు నందీయగా పుచ్చుకొన్నాఁడు.

"గులాబ్! నాప్రాణమా! స్వర్గమందలి దేవకన్యకలు మేల్కొలిపినట్లు—నీవు నన్ను మేల్కొలిపితివి."

ఆమె యీమాటల కొకమందహాస మొనరించినది. ఆతనిహస్తమును ప్రేమపూర్వకముగా నదుమసాఁగినది.

"ప్రియసీ! ఇదేవిధముగా నీవెల్లప్పుడును నన్ను మేల్కొల్పుచుండవలయును-ఈరోజున మాత్రమే కాదు! ఈరోజు మొదలుకొని యిఁకమీఁద...వేరొక విధముగానయినయెడల నేను సహింపలేను."

"సరేలెమ్ము—ముందు తేనీటిని ద్రాగుము—" అనుచునామె సంతోషోత్సాహములతో బిగ్గరగా నవ్వినది. ఆతని గూరుచుండఁబెట్టి తేనీటిగ్లాసుల నందించినది.

ఆయిరువురును తేనీటిని ద్రాగుచు-మధ్యమధ్యనవ్వుచు-చేఁపల వేఁటనుగురించి మాటలాడుచు-కొన్నినిముషముల కాలమును బుచ్చిరి ప్రాతఃకాలమున గగనతలమున సాధారణకాంతితోఁ గ్రాలుచున్న బాలభానుఁడు ఖుదీరామ్ మహాతాకమిత్సోత్సాహమును ఘటించుచున్నాడు—"ఈసమయమున నాపని బాగుండును—" అనుమాటలాతని నోటినుండి వెలువడినవి.

"ఏమని? జేపలను బట్టుటయా? చేఁపలచేతఁ బట్టుపడుటయా?" అని నవ్వుచు గులాబ్ ప్రశ్నించినది.

ఆమె తేనీటిగ్లాసుల నందుకొని, మేజాబల్లమీఁద పెట్టువరకు నాతఁడు మాటాడలేదు. తరువాత—

"గులాబ్! ఏవిషయమునుగురించినైన వేళాకోళ మొనరింపకుము" అని వినయపూర్వకముగాఁ జిరునవ్వుతో మనవి జేసికొనెను.

ఆమె—ఆసమయమున నాతనియొడిలో వ్రాలినది. ప్రేమరసార్ద్రములగు దృక్కుల నాతనిమీఁదికిఁ బ్రసరింపఁ జేసినది; రెండుచేతులతో నాతని మెడను బెనవైచి—పెదవులతో పెదవులనుదాకి ముద్దు పెట్టుకొనుచుఁ దన మానసోద్రేకము బ్రకటించినది.

"ఖుదీ! ఖుదీ! నేనునీతో మాటలాడవలయునని కోరుచున్నాను నిన్నుగురించియు, నన్నుగురించియుఁ గొన్నివిషయములను మాటలాడుకొని భవితవ్యము నిశ్చయింప గోరుచున్నాను—" అను మాటలుద్రేక పూరితమగు నామెకంఠమునుండి వెలువడినవి.

ఆతఁడులికిపడినాఁడు. వర్ణనాతీతమగు విస్మయమాతని ముఖమున విస్పష్టమయినది. ఆవిస్మయమునకు కారణమామె గ్రహించినది.

"ఖుదీ! నీవితరవిషయము లేవియు జ్ఞప్తియందుంచుకొనరాదు-నీమెదడులో నీవును—నేనుఁదప్ప నితరవిషయములు జ్ఞప్తికిరాఁగూడదు. ఈదినము మొదలుకొని—లేక—రేపటి లగాయితు నేనేమి చేయవలయునో, నీవు నాకెఱిఁగింపవలసి యున్నది. మనము బొంబాయి చేరినపిమ్మట నాకర్తవ్యమును నీవు నిర్దేశింపవలయును."

ఆతఁడు దిగులువడెను—ప్రత్యుత్తరమాతనికిఁ దోఁచలేదు—మౌనమువహించినాఁడు. వింతవింతచూపులతో మాత్రమామెనుజూచుచున్నాఁడు. అయిదు నిమిషములట్లు గడచినవి. తరువాతనాతని నోటినుండి యీక్రిందిమాటలు వెలువడినవి.

"గులాబ్! ప్రేయసీ! కర్తవ్యమునకేమున్నది? సర్వకాల సర్వావస్థలయందును నీవు నాకవసరము—నిన్ను నేనభిలషించుచున్నాను. నిన్నటిదినమునఁగూడ నాహృదయములో నిట్టి యుద్రేకము లేదు. నేను నిన్నెంతగా ప్రేమించితినో—ప్రేమించుచున్నానో— చెప్పఁజాలను."

ఆమాటల నాలకించుచున్నంతసేపు—అగాధము—అనంతమునగు సౌఖ్యమునామె యనుభవించుచున్నది. ఈవిశ్వమానవ ప్రపంచ

ముఖో దనవలె దమప్రియులనోటినుండి యట్టి పూర్వక వచనముల నాలకించు నదృష్టవతులెందరుండిరో—తమప్రియురాండ్ర నావిధిగా సంబోధించు యువకులెందరుండిరో-అన్నసందేహమామెకుదయించినది.

ఆమాటలామె కత్యంతమగు ధైర్యమును బురికొల్పినది. అంతే కాదు—ఖుదీరామ్ మెహతా—తనచర్యకు భయపడలేదన్న విషయ మా వచనముల మూలముననే రూఢియగుచున్నది. ఇంకనామెకు మాత్రము భయమేల?

ఆమె చిటికెన వ్రేలిని నోటబెట్టుకొని, మెల్లగా చప్పరించు చున్నది.

ఖుదీ! నేను నీదానను—అగును—పూర్తిగానీకు స్వాధీనురాల ను. నేను నిన్నటిదినమున ఆఫీసులో నాయుద్యోగమునకు రాజీనామా యిచ్చితిని. ఇకముందునీతో.........”

“అహో! గులాబ్! ప్రియసీ!”

అతని మానసికోద్రేకమును—ఆమెతల ద్రిప్పుచు, వారించి నది. మాటలాడక, మిన్నకుండుమని సంజ్ఞచేసినది. ఆమెకు చెప్పుట కెన్నో మాటలులేవు. ఒకటిరెండు మాత్రమున్నవి. వానినిగూడ వెలి బుచ్చవలయుననుకొన్నది.

“ఖుదీ! ఈదినము మొదలుకొని నేను నీదానను—నీకొరకే బ్ర తుకుచున్నాను. జీవితాంతమునరకు నీకుపయోగపడుటయేనాలక్ష్యము”

ఆతడు మానముద్రను దాల్పలేకపోయెను—ఆమెతలంచినట్లే- ఆతడు మహోద్రేకముతో మాటలాడినాడు. బొంబాయినగరము లో నొక సుందరమందిరము—పరిసర గ్రామములోనొకయిల్లు-అప్పు డప్పు డిరువురును గలసి షైరులు—ఈవిధముగా నాతడు మాటలాడి నాడు! గులాబ్ తలనూంకించినది.

"ఖుదీ! నీకు నాలాడ్జి నచ్చినదా?" అనుప్రశ్నతో నామె ఆతని ధోరణి నరికట్టినది.

"నేను......నేను ప్రేమించితిని. గులాబ్! ఈప్రపంచములో నీలాడ్జివలె హితకరమగు ప్రదేశము వేరొండు నాకు లేదు."

"అయిన మనము దానినట్లే యుంచుకొందము. ఖుదీ! నీవును-నేనును మాత్రమే అందుండవచ్చును—నాకెక్కువగా ధనమక్కరలేదు-లేనిపోని షోకులను నేను గోరను. మితిమీరిన ధనధాన్యములను నేనంగీకరింపను. నీవు నాకేమయిన నీయగోరినయెడల—దానినాశించి—దానికొరకై నేనునిన్ను ప్రేమింపను—నీకిచ్చుదానికిని—నీకుపయోగపడుటకునుమాత్రమే నేనాలోచింతును."

"అంతే! నేను మామూలువలె నాలాడ్జిలోనే నివసించెదను. నేను దానిని పరిశుభ్రముగా నుంచుకొని, మహదానంద మనుభవింపగలను—నీవక్కడకు వచ్చునప్పుడు—లేక—నీకొరకు వలయు సదుపాయములను జేయుటయే నాకు సంతోషము. బాహ్యప్రపంచమునుండి—నిన్ను నాలాడ్జికాకర్షించుటకు సర్వవిధములచేతను బ్రయత్నించెదను.........నేనెప్పుడు నక్కడే యుండెదను.......నీకు నేను గావలసివచ్చినప్పుడు......నీవక్కడకు రావలయును. నీకొరకెదురుసూచుచునుండెదను."

ఆమె కొంచెము సేపు మౌనమువహించినది. ప్రేమరసార్ద్రములగు చూడ్కుల నాతనిపై బరపుచు మరల నిట్లు నుడివినది.

"ఖుదీ! నీవేమియు బదులుచెప్పరాదు—నేనేమియునిన్ను గోరను. కేవలము నీవేనాకుఁగావలయును; నీప్రేమయే నాకవసరము. నేను మాత్రము ఫలాపేక్షలేని ప్రేమతో నిన్ను ప్రేమించుచున్నాను"

"కాని యొక్కటిమాత్రము నాకుఁగావలసియున్నది!......"

ఆమె ఆతని హస్తములలో వ్రాలియున్నది ఆతని ముఖమును

బరికించుచున్నది. తనకుఁ గావలసిన దానినిమాత్రమామె అతనికి వెలి వుచ్చలేదు. పెదవులవరకువచ్చిన మాటనే ఆమె మరలలోనికిదిగమ్రింగి నది. అందులకు కారణమామె ప్రేమయే! ఆమెకుఁగల ధైర్యమే

ప్రపంచములో నెల్లరు జూచుచుండఁగా—ఖుదీరామ్ మెహతా యొక్క భార్య కావలయునని ఆమె కోరుచున్నది!

ఆమె యొక్క మందహాసమంతలోనే అడఁగిపోయినది. బాధాకరమగు నిట్టూర్పుఁబుచ్చినది.

"ఖుదీ! నన్ను ముద్దుపెట్టుకొనుము.........ఒక్కపర్యాయము ముద్దుపెట్టుకొనుము"

ఆమెతన నేత్రములను మూసి అతని హస్తములలో వ్రాలినది ప్రపంచమును, తుదకుఁ దన్నుఁగూడ నప్పట్లనామె మరచిపోయినది.

ఆసమయమున హోటలులో గంట మ్రోగినది. ఛోటాహాజ్రీకి వేళయయినదని ఆగంటవలన నెల్లరు గ్రహింపగలరు. ఆఘంటానాద మాలకించి—ఆకస్మికముగా గులాబ్ తన ప్రియునిహస్తములనుండి జారినది. బెదరిన కురులను—సడలిన పైటను—కందినబుగ్గలను సవరించుకొన్నది.

"లెమ్ము—త్వరగాపోయి స్నానమాచరింపుము—ఎక్కువ ఆలస్యము చేయకుము. నీళ్ళు వేఁడిగానున్నవి. నేనుపదినిముషములలో స్నానము చేసితిని." అని నవ్వుచు నామె ఖుదీరామ్ మెహతాతో పలికినది.

ఆమె—స్నానమునకు వలయుదుస్తుల నాతనికొసంగి, బాతురూమునకు దారిచూపించి అతఁడందులో ప్రవేశించినవెనుక, తలుపు మూసినది.

తరువాత తనగదిలోనికివచ్చి—తాను దుస్తులను మార్చినది. ఇంచుకసేపు—"జపాన్-బుల్-బుల్" వాయించినది.

స్నానానంతరము—ఖుదీరామ్ మెహతా వచ్చునరికి గులాబ్ హాలులోఁగూరుచుండి, వార్తాపత్రికను జదువుచున్నది. ఇరువురు గలసి పోయి, ఛోటాహాజ్రి నారగించిరి. అప్పటికింకను సూర్యుఁడు ప్రచండ రూపమును గైకొనకుంటచేత నిరువురును, మరల సముద్రతీరమునకు వెళ్ళిరి.

---

## ఆఱవ ప్రకరణము.

---

నలుబది సంవత్సరములనఁగా నెంత!

ఉత్సాహముతోను, స్వాతిశయముతోను, ఖుదీరామ్ మెహతా యొకదర్జీవాని షాపులోనున్న నిలువుటద్దము ముందల నిలువఁబడి యుండెను.

నగముతయారయిన యొకజాకెట్టున కిద్దరు మనుష్యులు బొత్తములను గుట్టుచున్నారు. విశాలములు, కాంతిమంతములునగు నేత్రములతోను—గుండ్రని ముఖముతోను ఉన్నయొక యువకుని ఖుదీరామ్ మెహతా పరికించినాడు—ఆతఁడాయింగ్లిపురిలో నొకఁడు-

"నేను దగ్గరగా నలుబదిసంవత్సరములవయస్సు గలవాఁడను" అని మెహతా యాతని నవలోకించుచుఁబలికెను.

"సర్. మెహతాగారూ! మీయారోగ్యమత్యుత్తమమయినది. మీరు మల్లునివలె గనబడుచున్నారు" అని సీనియరుఫిట్టరయిన యా యువకుడు నుడివెను. మెహతాముఖమున మందహాస మంకురించినది

"నే నుక్కుగుండువలెనున్నాను—ప్రాతఃకాలమందనుదినము వ్యాయామ మొనరించుచుండుదును. గతపంద్రెండుసంవత్సరములనుండి

యా నట్లొనరించుచున్నాను. అని ఖుదీరామ్ పలికెను. తరువాత వాని కంఠమాగిపోయినది.

పండ్రెండు సంవత్సరములనుండియు......................!

అనఁగా గులాబ్ తోఁగూడ మొట్టమొదట బోరీపురమునకు వెళ్లినప్పటినుండియు అన్నమాట గులాబే పండ్రెండు సంవత్సరములకుపూర్వ మాతని నట్టిపనికి ప్రేరేపించినది. ఆమెయే..............!

సీనియర్ ఫిట్టరు తానుతయారుచేసిన కోటును ఖుదీరామ్ మెహతాకు తొడిగినాఁడు.

"రెండవది వచ్చేవారములో. బూ త్రియగునా? అగుటతోనే పంపివేయుము—తొందరలేదులెమ్ము" అనిపలుకుచు నుత్సాహముతో మెహతా—ఆషాపునువిడిచి వీధిలో ప్రవేశించినాఁడు. అతనికొరకక్కడ కారునిలిచియున్నది.

అతడు నడచుచుండగా—రెప్పవేయకుండ నుత్సాహముతో దర్జీవాండ్రిరువురును బరికించిరి.

"సర్. ఖుదీరామ్ మెహతా చాలమంచివాఁడు. మిక్కిలి పెద్దమనుష్యుఁడు" అనుమాటలు సీనియరుఫిట్టరు నోటినుండి వెలువడినవి.

"అగును—పెద్దమనుష్యుఁడు గాకపోవుటయేమి? ప్రస్తుతము పేరుప్రతిష్టలు వహించిన రాజకీయవేత్తలలో నాతఁడగ్రగణ్యుఁడుగదా! పాప మన్నవస్త్రములులేక, బాధపడుచు, నిరుద్యోగపిశాచగ్రస్తులైన యువకులకు వేలకొలంది పనుల నాతఁడేకదా కడచినకొద్ది మాసములలోఁ గల్పించినాఁడు! నిజముచెప్పవలసి వచ్చినయెడల ఖుదీరామ్ మెహతాతన "సర్" బిరుదమున కర్హుఁడు." అని రెండవమనుష్యుఁడనెను.

♦ ♦ ♦ ♦ ♦ ♦ ♦ ♦ ♦ ♦ ♦ ♦

ఖుదీరా మెహతా తనకారులో బ్యాక్ సీటునందు హాయిగాఁ గూరుచుండెను. ఆభరణములనమ్ము షాపునకుఁ గొనిపోవలసినదిగా

నాతఁడుడై ప్రవరునకాజ్ఞాపించినాఁడు. తరువాతనాతనిమెదడులో నూహాసందోహము లనేకము లుత్పన్నము లయినవి.

పండ్రెండు సంవత్సరములకు పూర్వము గులాబ్ ఆతనికిఁ బ్రాణాధికము. అప్పుడాతఁడు చపలచిత్తుఁడు పనిపాటులేని బద్ధకస్తుఁడు.—

కాని—నేఁడో! "సర్" ఖుదీరామ్ మెహతా! శాసనసభాసభ్యుఁడు గొప్ప రాజకీయవేత్త, ప్రాముఖ్యమువహించిన నొకొవ్యాపారసంఘాధిపతులలో నొకఁడు! విశేషించి యాతఁడు శాసనసభలో బ్రవేశపెట్టిన ప్రజోపకారములగు రెండు బిల్లులమూలముననే మూఁడులక్షలమందికుద్యోగములను, దన్మూలమున సన్నవస్త్రములును లభించినవి. ఆతఁడు—ఉక్కుగుండువలె నున్నాఁడు—అనగా నారోగ్యవంతుఁడు. అదివరలో కంటె సర్వవిధములచేతను ఆతఁడిప్పుడు బలవంతుఁడు—యౌవనవంతుడు—ఉత్సాహవంతుడు! అతడిప్పుడు నిజముగా బ్రతుకుచున్నాడు. ఆతని నేత్రములొక్కుమ్మడిగా నొక యాలోచనముతో ప్రకాశించినవి.

గులాబ్! భగవంతుఁడామెను సాకుగాత! ఆమెవలననే తనకట్టి పేరు ప్రఖ్యాతులలవడినవి. ఆమెవలననే "సర్" బిరుదమొచ్చినది—శాసనసభాప్రవేశముకలిగినది—శరీరారోగ్యము కుదిరినది—సౌఖ్యము సంతరిల్లినది—నిజమయిన జీవితభాగ్యమలవడినది. ఆమెయేతనలోని యుత్సాహమునకును బ్రేరేపకశక్తికిని కారణభూతురాలు—ఆమెసందేశమే ఆనాడు తన చెవినిబడనియెడల—ఆమెసలహాయే యిప్పుడు తనకు వినబడనియెడల దానిపాటి కదోగతిపాలై యుండెడివాడే! తన యున్నతస్థితియంతయు నామెకు జెందవలసియున్నది.

కారు వజ్రములవర్తకుని షాపునొద్దనాగినది. సర్ ఖుదీరామ్ మెహతా యందుండిదిగుటతోడనే—షాపు యజమాని అత్యంత గౌరవముతో వాతనికెదురేగి లోనికిదోడ్కొనివచ్చి యుచితప్రదేశ

మున గూరుచుండజేసెను. తరువాత యజమానియే స్వయముగానొక చిన్నపెట్టెను దెచ్చి ఖుదీరామ్ మెహతా ముంగిల బెట్టి—

"సర్. ఖుదీరామ్ మెహతా బాబూ! యిదిగో నజ్రిలహారము వచ్చినది, దయచేసిచూడుడు" అనెను. అమూల్యము—అత్యంత మనోహరమునగు నాహారమును మెహతా అందుకొని పరిశీలించెను. కాని యాతడదివరకట్టి తరగతికిజెందినవాని నెన్నిటినో యాతడుచూచి యుండుటవలన నంతగా నాశ్చర్యమునుంగలేదు.

"బాగున్నది—ఇట్టిదే కావలయునని నేను చెప్పితిని. ఇది యామెకు సంతోషమును గలిగింపగలదు—దీనిని దీసికొనిపోవుదును" అని ఖుదీరామ్ మెహతాయనెను. తరువాత వెంటనే యాహారముతోగూడ నాతడు షాపునువిడచి, వీథిలోనికి—కారునిలిచియున్న స్థలముకడకు బోవుచుండెను. ఆతనిచర్య యజమానునకత్యంతాశ్చర్యమునుగలిగించినది. ఆతడు మర్యాదపూర్వకముగ మెహతాను వెనుకకుబిలిచినాడు.

"సర్. మెహతాబాబూ! ఆ హారముయొక్క వెలయెంతయో మీరుతెలిసికొనలేదు. అధవానన్నడుగలేదు" అని యాతడనెను.

"హెన్హా! ఈవస్తువెంతవిలువగలదియయిననుండవచ్చును నేను ధనమునకాశించి వెనుకంజవేయువాడనుగాను. దీనివెలకును దీనికిని సంబంధములేదు"అని ప్రత్యుత్తరమిచ్చి ఖుదీరామ్ మెహతా వడిగా దనకారులోనికిబోయికూరుచుండెను.

"లతీఫ్! బ్రేకర్ స్ట్రీట్!"

డ్రయివరు లతీఫ్ విశ్వాసపాత్రుడు—ఆతడు తనయజమానుని మాటనుగ్రహించినాడు. కారుసాగిపోవుచున్నది. మరల ఖుదీరామ్ మెహతా ఊహాసందోహమునకు దనహృదయమునదావిచ్చినాడు.

"పండ్రెడుసంవత్సరములు! ఆహా ఆకాలము స్వర్ణయుగమునకు జెందినది. గులాబ్ తనయొక్కహృదయములోబ్రవేశించి తనచరి

త్రిమున నూతనశకమారంభింపజేసి, తనయున్నతికనేకవిధముల గారణ భూతురాలయినది.

ఆకస్మికముగా నాతనికనుబొమలు ముడిపాటువడ్డవి. అదివరలో నొకప్పుడు దారుణమగు భయమునకాతడు గురియగుచుండెవాడు. గులాబ్ గోహారులలో నెవ్వతను జేకొని యెవ్వతెను బరిత్యజించుటా యన్న వితర్కమాతనిమనసులో తొల్లి యనేకపర్యాయములు పొడసూపినది.

అతడిప్పుడెరుగును. అథవా సర్వమెరుగగలిగినట్లు నమ్ముచున్నాడు. అందులనుగూర్చి సందేహమావంతయు లేదు. గులాబ్ అతని ప్రేమ—ప్రాణము జీవితము! ఆమెనుగురించి యాలోచించుటకారంభించినంతనే వానిహృదయమతి తీవ్రముగా గొట్టుకొనసాగెను.

కాని యసందర్భమేదియు ప్రాప్తింపలేదు. కాని గోహారు తొల్లిటివలె నేడుగూడ మనోహరమగు శీలమును—అనుపమానములగు వినయవిధేయతలను—భక్తిశ్రద్ధలను గనబరచుచునే యున్నది. ఆమె చక్కగా సంసారమును దిద్దుకొనుచున్నది. ఆమెలో లోపము గోచరించుటలేదు. ఆమె యాతనినవమానించుటలేదు. ఆతనియొద్దనుండి యేమియుగోరుటలేదు. కాని యొకకొరతగన్పట్టుచున్నది. అదేపెద్దది. దానివలననే ఖుదీరామ్ మెహతాకు సంతృప్తిగాని, సంతోషముగాని కలుగలేదు. ఆమెలో మహోన్నతాశయములు పొడసూపలేదు— ఆమె దృక్పథము ప్రశంసనీయమయినదికాదు! ఆమెలో ఆమెకు గావలసినవన్నియునున్న మాటనిజమే—కాని యాతనికి గావలసినదేదియు లేదు. అయినప్పటికిని.........కొన్ని సంవత్సరము లయినదికదా! ఆమెయాతనియొద్దనుండి ప్రతిఫలమాశింపలేదు. అనియేవానియాశ్చర్యమునకు గారణము! ఆమెకు స్నేహితులనేకులుగలరు—ఉత్తమగుణసంపన్నలగువారితో నామెకు పరిచయము మెండుగానున్నది. పార్క్

లేన్‌లోనున్న యూతని భవనమునకుఁదఱచుగా నామెతో బాతాఖానీ వేయుటకు—రమేశచంద్రుడును—మోహనచంద్రుడును వచ్చుచునే యుండెడివారు, వారిలో రమేశచంద్రుడు యౌవనమధ్యముననున్నాడు గోహార్‌తో బ్రసంగించునప్పుడెల్ల వాని నేత్రములలో వింతభావములు వ్యక్తపడు చుండెడివి.

గోహార్ అపరిచితులవలననుత్సాహమనుభవించు చుండెడిది—ఆమె రమేశచంద్రుని వింతభావములకును—వింత ప్రవర్తనమునకును నవ్వుచుండెడిది. అతఁడే కారణము చేతనయిన ద్వారలో మతిభ్రమణము పొందగలడనియు నూహించు చుండెడిది.

మొత్తముమీద.........గోహార్ అనుకూలవతియగు భార్య

ఆమెలిన సంసారమును దనకుమారుని—కృష్ణచంద్రమెహతా-చక్కగా సాకుచున్నది. కుమారుడనుటతోనే, ఖుదీరామ్‌మెహతాయొక్క హృదయముచలించినది......కుమారుడగుకృష్ణచంద్రమెహతాకు ప్రియముపై బడినది. అతడు స్కూలులో జదువుచున్నాడు. సరిగా నేటిరాత్రి—సెలవులగుటవలన—ఇంటికిదిరిగి వచ్చుచున్నాడు. భోజనసమయమున కందువలన దానికిటికి పోవలసియున్నది ......మెహతాయీవిధముగా నాలోచించెను—అతనికి కుమారుడగు కృష్ణచంద్ర మెహతా ఉన్నతాశయములుగలవాడు గావలెనని కోరికగలదు.

అతని నోటినుండి అప్రయత్నముగా నవ్వు వెలువడినది. అతని హృదయముననొకభయముతోచినది- అదియంతరాత్మయొక్క భయము

అదివరలో నొకప్పుడు తాను చేయుచున్న చర్యలకు—లేకతానుగడుపుచున్న బ్రతుకు తెరవునకు తీరని వ్యాకుల మనుభవించియుండెను. ఆవ్యాకులత గులాబ్ గోహారులవలన గలిగినదే! తన ప్రవర్తన మాయిరువురికును అన్యాయదాయకము—అమర్యాదకరమునయినదే.

కాని యూతని హృదయమందిప్పుడు పరివర్తనము గలిగినది. అతని ప్రవర్తనలో నిప్పుడు దోషములేదని యూతడు గ్రహించినాడు.

గ్రహించుటమాత్రమే కాదు—విశ్వసించినాడు. అనుభవమువలనను—కార్యములందు గోచరించు జయమువలనను ఆతని కామెలకువగలిగినది. ఆవిశ్వాసముకుదిరినది. ఆతడు గులాబ్ నువిడిచినయెడల బ్రతికిరాడు—ప్రయోజనపడడు... అంతే కాదు మానవమాత్రుడే కాడు! ఇక గోహర్ ఆమె కేమి! ఆమెవిధాన మామె మనువంటి చియే యున్నది.

ఖుదీరామ్ మెహతా యొకపర్యాయము తన రిష్టువాచీని బరికించినాడు. కారు సాగిపోవుచునేయున్నది. బేకర్ స్ట్రీటులోనున్న గులాబింటికి కారుచేరుకొనుటకింకను అరగంటపట్టును—దురదృష్టము! ఆయరగంటకూడా నామెదగ్గరనున్నయెడల నెంత ప్రయోజనకరముగా నుండునో!



ఖుదీరామ్ మెహతా మేడమెట్లు నెక్కినాడు. ఎలక్ట్రిక్ బెల్ మ్రోయించినాడు. గులాబ్ వాని మ్రోల ప్రత్యక్షమయినది— వానిని దనగదిలో ప్రవేశ పెట్టినది—ఆమె యాతనికౌగిత బంధింపబడినది. ఇరువురును సిటింగ్—రూమ్ చేరినవెనుక నిలువబడియే యుండిరి. క్షణకాల మువర కొకరిమొగమొకరు చూచుకొనుచు—మౌనముతో నిలువబడి యుండిరి.

అనేకము సంవత్సరములకు బూర్వము—మెహతాను, ఆమె ఆమేడమీదికే ఆగదిలోనికే తీసికొని వచ్చినది. అప్పటివస్తువులే యిప్పుడును బరిసరములందును, గదియందును గన్పట్టుచున్నవి—కాని యొకమార్పు మాత్రమున్నది మెహతా మిక్కిలిగా యిష్టపడుపట్టు కుషానులుమాత్రము క్రొత్తగా గదిలోని సామానులకు జేర్పబడినవి. వారికెట్టెదుటనున్న మేజాబల్లమీద పలురకములగు పుష్పము లున్నవి—ఫ్లాస్కులో టీ యున్నది.

మెహతా నామెను ప్రేమముతో మద్దిడుకొనెను— ఆకస్మిక

ముగా ఆతనినోటినుండి నవ్వు వెలువడినది.

"గులాబ్! ప్రేయసీ! నేను—ఇప్పుడు—ఈక్షణమందు—ఇక్కడకు వత్తునని నీవెట్లు తెలిసికొంటివి?"

ఆప్రశ్నకు గులాబ్ చిరునవ్వు నవ్వినది.

"నేను నీకారునుదూరమునుండి చూచితిని—చూచుటతోనే యెలక్ట్రిక్ కెటిల్‌తో టీపెట్టి, నీవు మేడమెట్లనెక్కుచుండగా నప్పటివలె ఫ్లాస్కులో పోసితిని."

"అహో! ఏమి నాభాగ్యము!"

మరల నిరువురి పెదవులును పోరాడసాగినవి. ఆమె నేత్రములాతని నేత్రములకు స్వాగతమిచ్చినవి. ఆతని చూపులామెనుగలంచలేదు కాని యామెచూపులు మాత్రమాతనిమీదనే గురియైయున్నవి. ఆమె కాతడు తరచుగా వచ్చుటలేనట్లును, వచ్చి యెంతసేపున్నను అప్పుడే వెళ్ళిపోయినట్లును అనుకొనుచున్నది.

ఆతడామెను మెల్లగా విడిచినాడు.

"ప్రియన్! గులాబ్; ఈదినము నీజన్మదినము—నేను మరచిపోలేదు! నేను ప్రత్యేకముగు నొకవస్తువు కొరకార్డరిచ్చి తెప్పించితిని—నిజముగా నది నీగళము నలంకరించినయెడల మిక్కిలి సొగసుగా నుండును...సందేహములేదు—"

ఆతడొక చిన్నపెట్టెను తెరచినాడు—అందులో బాలసూర్య ప్రభాభాసితము—అమూల్యము—అనుపమానమునగు వజ్రహారమున్నది. దానింజూచుటతోనే యామెకన్నులు మిరుమిట్లు గ్రమ్మినవి అంతేకాదు—ఆమె కింతింతనరాని యాశ్చర్యము—దానితో బాటు భయముగూడ గలిగినవి.

"ఖుదీ—ఖుదీ! నాకాశ్చర్యముగుచున్నది.........ఎందులకది? వెలయెంత?............నిజముగా కొన్నివేలరూపాయల..."

ఖుదీరామ్‌మొహతా మందహాసమొనరించినాడు తలనుంకించి నాడు. ఆవజ్రహారమును పెట్టెనుండి బయటకుదీసి యామెకంఠములో వేసినాడు—

"నేను వెలనడుగలేదు...గులాబ్! నాకు వెలతోనిమిత్తము లేదు—నీకుకోట్లకొలదిరూపాయిల విలువజేయు వజ్రములయినను సరి పడవు నీప్రేమకు దగినమూల్యమీ లోకములోలేదు—నేనీయలేను- ఇట్టి జన్మదినములు—ఆనందదాయకములగు జన్మదినములు మరల మరలవచ్చుగాక!"

ఆమె యాతనిని మరలముద్దిడుకొన్నది. ఆమెనేత్రములశ్రు పూరితములయినవి. ఆహా! ఆతనినోటినుండి యట్టివాక్యములను— హృదయాంతర్భాగమునుండి వెలువడిన ప్రేమరసప్రవాహములగునట్టి వాక్యములను వినుటకంటె నామెకింకేమి కావలయును!

"ఖుదీ! టీ సిద్ధముగనున్నది......ఇంక భోజనము......!" ఆతడు తలనాడించినాడు. ఆప్రశ్నకాతని నేత్రములు కాంతిరహితము లయినవి.

"ప్రేయసీ! నేనీరాత్రి యింటికిభోజనమునకు వెళ్ళవలయును- వెళ్ళకతప్పదు"

"ఈరాత్రియా? ఆమెత్రుళ్ళిపడినది.

"కృష్ణచంద్రుడీరాత్రి సెలవులగుటచేత నిండికివచ్చుచున్నాడు. నేను తప్పకవచ్చెదనని బాసచేసితిని—అందువలన......"

"అగును—ఖుదీ! నీవు వెళ్ళక తప్పదు—భోజన మింటికడనే చేయవలయును—"అని యామె యుద్రేకపరిపూరితమగుకంఠముతో నుడివినది. ఆమెమరలనాతనివయిపు తనదృష్టిని కేంద్రీకరింపజేసినది.

"ఖుదీ ఆతండెట్లున్నాడు"

ఖుదీరామ్‌మొహతా—తనకోటువిప్పి బల్లమీదపెట్టి తాను

మామూలుగాకూరుచుండుకుర్చీలోగూలబడి యామెయిచ్చిన రొట్టెను తిని తేనీటినిద్రాగ నారంభించినాడు—

"గులాబ్ కృష్ణచంద్రుడు మిక్కిలి తెలివితేటలుగలవాడు— నీవు వానింజూడవలయుననుకొందును"

ఆమె యాతని నవలోకించినది.

"నీవు నీకుమారునిగురించి గర్వించుచుంటివన్నమాట!"

"నేను వానినాదరింతును—కాని నాయాదరమువాతని గ్రహింపరాదు" అని పలుకుచు మెహతా నవ్వినాడు.

ఆమె క్షణమువరకు మాటాడలేదు—ఆపంద్రెండు సంవత్సరములలోందప్పనిసరిగా ప్రాప్తించిన సంఘటనములనుగురించి గూరామె యాలోచించినది.

ఖుదీరామ్ మెహతాకొరకు దనకు పిల్లలు పుట్టరాదని గులాబ్ సంకల్పించుకొన్నది. సంతానమునకుగాను తమ యిరువురకు పెండ్లికాగూడదని యామె యభిప్రాయము. ఇంతకును దనకు పెండ్లియగునవకాశమే లేదని యామె మరల గ్రహించినది. ఆగ్రహింపు హృదయాంతర్గతమున నొక విధముగు బాధను గలుగఁ జేసినదనుటలో సందేహము లేదు.

కాని యామె యెన్నడును అట్టిబాధను వెలిబుచ్చదు... వెలిబుచ్చలేదు— ఇకముందయిన వెలిబుచ్చబోదు. ఆమె యుత్సాహముతో దన ప్రియునవలోకించి—

"ఖుదీ ఈదినమున నీవు శాసనసభలోగావించిన యుపన్యాసమునుగురించి వినిపింపుము—ఇది యుసర్గళముగా సాగిపోయునవా. నీవు ఉపపాదించిన బిల్లు మూడవ పర్యాయము చదువబడినదా" అని యడిగెను.

ఆతడౌననినట్లు తలయూచినాడు — ఆకస్మికముగా నాతని

హృదయము గులాబ్ గోహారులలోఁగల తారతమ్య మిట్టిదేయని తలంచినది. తన శాసనసభా కార్యక్రమమునుగూర్చి కాని, యితరపనులనుగురించికాని గోహారెన్నఁడును అట్లు ప్రశ్నింపలేదు. అందులకాతనికి విచారములేదు. ఆమె ప్రశ్నింపకుండుటయే యాతనికి సంతోషము! ఎందుచేత? ఆప్రశ్నలు—తన్నట్టిమహోన్నతస్థితికి గొనివచ్చినయువతి నోటినుండియే వెలువడవలయునని యాతని యభిప్రాయము.—

“ఉపన్యాసము బాగుగనేసాగినది......దాని సారాంశము త్వరలోనే పత్రికలలో ప్రకటింపఁబడును......గులాబ్! దీనికంతకును నీవుగదా కారణభూతురాలవు! నసహాయముచేత—నీప్రోత్సాహముచేత—నీసలహాలచేత నేనిట్టి యున్నస్థితి నందగలిగితిఁగదా!”

గులాబ్ అదరిపడినది —

“మూఁడవపర్యాయమాబిల్లు విమర్శింపఁబడినదా?” అని ప్రశ్నించినది.

“ఆ—విమర్శింపఁబడినది. గులాబ్! ఇంకొకవిశేషము—ఇంగ్లాండు దేశములోని పారిశ్రామికాభివృద్ధిని బరిశీలించుట కిక్కడనుండి కొన్నివారములలోనే కొందరు ప్రముఖులు సంఘముగానేర్పడి—అనధికారరీత్యా పోవనున్నారు. నేనాసంఘమున కధ్యక్షుఁడను. కనుక నేనగూడ నాంగ్లదేశమునకు పోవలసియున్నది......గులాబ్!”

అతఁడింక మాటలాడలేదు—చేతులోనున్న తేనీటికప్పును మేజాబల్లమీఁదఁబెట్టినాఁడు. ఆమె నేత్రములలో కాంతిపుంజములు ప్రతిఫలించుచున్నవి. అతఁడామెను దన బాహువుల మధ్య నిమిడ్చుకొనఁగలిగెను.

“గులాబ్; ఈప్రయాణము యొక్క అర్థమును నీవు గ్రహించితివా? మన మిరువురకును గొప్ప అవకాశమేర్పడినది.—మనమిరువురము వేఱువేఱుగా ప్రయాణము లొనరించినను, ఆంగ్లదేశమునందును, తదితర పల్లెపట్టణములందును లెక్కలేనిపర్యాయములొండొరులము గలి

సి కొనఁగలము—మనమిరువురము సంతోసముగఁ గడుపగలము. పశ్చాత్యదేశములను జూచుటకు నీవు కుతూహలమును గలిగియున్నా వనియు నేనెఱుంగుదును. ఇదియే తరుణమని నేనంగీకరింపవలసి యున్నది.”

గులాబ్ ఆమాటలనాలకించి దీర్ఘముగ నొక నిట్టూర్పు విడిచి నది. ఆమాటలు క్రియారూపమును వహించినయెడల వానియందు ప్రాముఖ్యమెంతయో యుండునని ఆమె గ్రహించినది—ఆంగ్లదేశము నకు ఖుదీరామ్ మెహతాతో ప్రయాణమా?........కొలదిసంవత్సర ములనుండియు స్వప్నములో ననుకొనుచున్న దియదార్థముకానున్నదా? రహస్యముగా తాను ఖుదీమెహతా నీవిధముగాఁ గలసికొనవక్కఱ లేదు........ప్రజలయొక్క అనుమానమునకును, హిందూదేశము నకును దూరముగఁ బోవచ్చును—తాను ప్రత్యేకముగ—నిర్భయము గా—నిస్సందేహముగా—కొన్ని దినములవఱకు దన ప్రియునితో నుం డవచ్చును—ఆమె యిట్లాలోచించినది.

నిజమునకామె హృదయమా ప్రయాణమన్నంతనే, చలించిన దని చెప్పవచ్చును. ఆమెతన మోమెత్తి యొకతూరి మెహతా నవలో కించినది.

“ఖుదీ! ఈప్రయాణమందు నాకిచ్ఛగలదు. కాని యీపరిస్థితు లలో మాత్రము నీవు దీని నంగీకరింపరాదు—”

“ఎందుచేత?”

“రాజకీయ వ్యవహారములలో నీకు బ్రతికూలురగు వారీమిష మీఁదనిన్ను బరదేశములకు బంపనున్నారనుకొందును. కాని రానున్న నూతనరాజ్యాంగములో ప్రధానామాత్యపదవికి నీవు పోటీ చేయవలసి యున్నది. అందులకు నీవర్హుడవు—దానిబడయుటకు నీకవకాశము

లెక్కనగా నున్నవి. ఇట్టి తరుణములో నీవు పాశ్చాత్యదేశముల కేగిన యెడల నీకీ ఛాన్సు లభింపదుగదా”

ఆమె క్షణకాలమాగినది—ఆలోచన మభినయించినది—మర లకృతనిశ్చయురాలైనట్లు కన్పట్టినది.

“ఖుదీ! వద్దు! నీవు వెళ్ళవద్దు—నీవిక్కడనేయుండి రాబోవుచున్న కలలో మహోన్నతమగు నాపదవికి పోటీ చేయవలయును.”

ఒకవిధముగా నాతడు నిరాశనే పొందెను, ఆతడామె చేతులను దన పెదవులయొద్దకు దీసికొని, ప్రేమపూర్వకముగా చుంబించినాడు, ఆమె యొసగిన సలహాయందలి యభిప్రాయమును గ్రహించినాడు.

“ప్రేయసీ! గులాబ్! నీ వెల్లప్పుడును నన్ను గురించియే ఆలోచించుచుందువా?”

“ఖుదీ! నేను నిన్ను గురించితక్క—అన్యులను గురించి ఆలోచింపజాలను. నాసర్వస్వమును నీవే కదా!”

“ప్రేయసీ! రమ్ము—క్షణకాలము నీపరిష్వంగ సౌఖ్యమను భవింపనిమ్ము. నీజన్మదినముగదా! నేను మరల పోవలసియున్నది”

ఇరువురును బిగ్గరగా నొండొరు గాగిలించుకొనిరి. ఒకరినొకరు ముద్దిడుకొనిరి—ఆ చర్యకర్థమేమి? అగాధము—అనంతము—అపూర్వమునగు ప్రేమయేయని వారి యభిప్రాయము.

“పండ్రెండు సంవత్సరములు!......నేను నమ్మలేకున్నాను ......ఖుదీ! మనము వృద్ధులమగుచున్నాము—” అన్నదామె.

ఆమెమాటలాతని చెవిలో బ్రవేశింపనేలేదు. ఆమె తన్ను గురించియాలోచించుకొనుచున్నది. స్త్రీలు—ప్రత్యేకముగా దన జీవితము వంటి జీవితముం గడుపుస్త్రీలు—అచిరకాలములోనే వృద్ధలగుదురు-ఎందుచేతననగా తనమనుగడ తనకొఱకుగాక మరియొకనికొరకు అంతే కాదు! ఒంటరిగ నింకొకనికొరకు మాత్రమే బ్రతుకుచుం దీరనిమనో

వ్యాధికి గురియగుచు నున్న యెడల వయసుమీఱకున్నను, వృద్ధాప్యము పైబడినట్లే యుండునుగదా!

గడియారము టంగుటంగుమని కొట్టినది. తొలుదొల్త బిగి కౌగిటనుండి గులాబే తప్పించుకొని నిలువఁబడినది. మ్యాంటల్ పీసు మీఁదనున్న యెలక్ట్రిక్ స్విచ్ నొక్కినది—ఆతనిదుస్తుల నందించినది. ఆతఁడు వానిని వెంటనే యందుకొనలేదు; కొన్నినిముషములవఱకు నిర్జీవప్రతిమచందమున నిలువఁబడి యామెను బరికించినాఁడు.

"గులాబ్! నీవందక త్తెవు.....వయస్సుపెరుగుచు నానాఁటికి నీసౌందర్యమునుగూడ పెంచుచున్నది."— అని నుడివి యాతఁడు నవ్వెను-

"ఓయి భగవంతుఁడా!.....భ్రమరములఁ బోలిన అముంగురులు.....కాంతిమంతములగు ఆనేత్రములు.....ఎఱ్ఱని యా పెదవులు.....పట్టువలెనున్న యాచర్మము.....ఆహా! అవియన్నియు నిన్ను నిరంతరము కన్యగనేయుంచును.....గులాబ్! ఓ గులాబ్! నీవు వృద్ధురాలవగుదువుగాక! శతవృద్ధవగుదువుగాక! ఎప్పటికిని, ఎట్లున్నను నీవు నాదానవే! మనమిరువుర మెప్పుడు నిట్లేయుండవలయును—" అనిఖుదీరామ్‌మెహతా ఉద్రేకముతో నామెను గాఢముగఁ గౌఁగలించుకొని. ముద్దిడుకొని—తరువాతఁ దన దుస్తులనందికొని, వడిగా వీధిలోనికిఁబోయినాఁడు—

ఆతఁడు నిష్క్రమించినతరువాత—గులాబునకేదియో పాశించినట్లయినది. ఒక వృద్ధురాలాగదిలోఁ బ్రవేశించి యామెయెదుటఁ గూరుచుండి, వక్షమునఁ దళతళమెఱయుచున్న వజ్రహారమును బరికించుచున్నది.

ఖుదీరామ్‌మెహతా చెప్పిన మాటలలో అసత్యమేదియు లేదు- ఆతఁడామెను శ్లాఘింపలేదు. యదార్థమును మాత్రమే నుడివినాఁడు.

ఆమెతన కట్టెదుటనున్న అద్దములో నొకపర్యాయము తన్నుదాను తిలకించుకొన్నది. ఆమెలో బదునేడు సంవత్సరములకు బూర్వమున్న సౌందర్యమునేమ తగ్గలేదు! అప్పటియాకర్షణశక్తి నేడి కను ద్విగుణీకృతమయిన దనికూడ చెప్పవచ్చును

కాని యామెనేత్రములలో మాత్రమప్పుడప్పుడు మార్పుపొడసూపుచుండును—ఆనేత్రములు ఖుదీరామ్ మెహతా కట్టెదుట నున్నపుడు కాంతివంతములు! అతడు లేనపట్ల కాంతిహీనములు!.....

వజ్రహారము!............అత్యంత రమణీయముగనున్నది. ఆమేడలో దానిమూల్యమునకు సరిపడిన వస్తువు మరియొకటిలేదు అభరణముయొక్క వెలకంటెను బదిరెట్లధికముగు వెలచే దానికీయవలసి యుండును. కాని—ప్రపంచమునిష్పాక్షికబుద్ధితో నాలోచనమొనరించినయెడల—పండ్రెండు సంవత్సరముల పరిమితిలో—ఆస్వర్ణయుగములో—ఆమెయాతనికి సమర్పించిన దానికా వజ్రహారము సరియయిన ప్రతిఫలమగునా?

ఆమెకిప్పుడున్న భాగ్యమమూల్యమయినది—దానికివెలకట్టుట కేరికిని శక్యముగాదు. అదెట్టిది? అది ఖుదీరామ్ మెహతాయొక్క నిష్కళంక ప్రేమ!

ఆదినమామె జన్మదినము—ఆమెతన గతజీవితవిధానము ననుసరించితనలో దానాలోచించుకొనుచు గంటలకొలది కూరుచున్నది. కాని, విచారమునుమాత్రము వ్యక్తపరచుటలేదు హృదయమునందు బ్రజ్వరిల్లుచున్న కారుచిచ్చును బైకిరానీయుటలేదు అప్లెయ్యి......

ఆమెసౌఖ్యము పరిపూర్ణముగా లేదు—కాజాలదు. ఆసౌఖ్యము విచారకరమయినది, ఒంటరిదైనది. ఆవిధముగా రహస్యముగా ప్రేమించుట లోకుల యపనిందకు బాలుపడుటకే—లజ్జాభరమున క్రుంగిపోవుటకే! సంతాన భాగ్యముకొరకాకమూల హృదయమాత్రి

పడుచున్నది. కానియేమిలాభము, సంతానముగనుటకు వీలులేదు. ఆమెతన సర్వస్వమును దనప్రియునకర్పించినది—అర్పించుచున్నది—అర్పింపనున్నది. కాని తన ప్రేమను గాని, తన ప్రియుని గాని లోకమెరుగరాదు! ఆమె యొక యుంపుడుకత్తె!

ఇట్టివిధములగు విచారములున్నను, గులాబ్ ప్రేమయొక్క పరిపూర్ణతత్వమును దెలిసికొన్నది. సంతృప్తిపడ్డది ఆమెయొక నిట్టూర్పు బుచ్చి, ప్రియునిచేత నొసగబడిన యావజ్రహారమును ముద్దిడుకొన్నది—సంతుష్టిపడినది—సంతోషమందినది—

అప్పటికే మిక్కిలి యలసియుండుటవలన గులాబ్ శయ్యంజేరి నిద్రించినది ఖుదీరామ్ మెహతా మరలవచ్చి యామెను గలియువరకు నామెలో మార్పుండదు!

ఖుదీరామ్ మెహతా కారులో కూర్చుండి తనగృహమునకుం బోవుచున్నాడు...దారిలో దానొసగిన వజ్రహారమునుజూచి గులాబ్ ఆశ్చర్యపడిన విధమును మాటిమాటికి జ్ఞప్తికి దెచ్చుకొనుచుండెను.

"ధనమా! ..... .....అతడు నవ్వినాడు. ఆమెయెప్పుడును దానేదియో యెక్కువగా నీయనున్నట్లుతలంచి భయపడుచునే యుండును. ఇంతకు దానిచ్చినదేమున్నది. ఆ వజ్రహారము కారువెలకంటె నెక్కువ యుండదుగదా! ఛీ! ఛీ! సిగ్గు సిగ్గు! గులాబ్ యొక్క ప్రేమ కాహారముచాలదు. కాని కను అధికముగనిచ్చియుండవలసినది అయ్యో ఎంతపొరబాటయినది!" అతడిట్లుతలంచి, తలయూచినాడు. ముందెన్నియో కష్టములు కలుగనున్నవని భ్రమించినాడు. కాని గులాబ్ తన సంతృప్తిని విడువనంతకాలము విషమపరిస్థితులేర్పడవని గ్రహించినాడు.........

అతడొక వార్తాపత్రికను కారులోనుండియేకొని, ఉబుసుపోవకవానివలె కేవలము హెడ్డింగులనుమాత్రమే చూచుచున్నాడు.

ఆ హెడ్డింగులలో—'ఆత్మహత్య! యువజనసంఘ కార్యదర్శియొక్క ఆత్మహత్య!' అని దానినాతడు చూచినాడు. తోడనే అదరిపడినాడు—ఆత్రముతోను—ఆశ్చర్యముతోను— అందలి విషయమును బఠించినాడు:

"యువజనసంఘ కార్యదర్శియు, విద్యాధికుడును, ధనికుడును అగు రమేశచంద్రుడు తన మేడమీదిగదిలో నాత్మహత్య చేసికొనెను—అతనిప్రక్క నేపిస్తోలున్నది. అతడు తనచర్యకు గారణమేమియు దెలుపలేదు—కాని యాగదిసమీపముననే సగముచింపబడిన నలుపబడిన యొకయుత్తరమున్నది. అందలిదస్తూరీని బట్టిచూడగా నదియొకయువతిచేత వ్రాయబడినదనుట విస్పష్టము—"

వార్తాపత్రికలోనున్న పైయంశములను జదువుటతోనే, ఖుదీరామ్ మెహతా వ్యాకులమనస్కుడాయెను. రమేశచంద్రుడు తరచుగా తనగృహమునకు వచ్చుటయు నత్యంతప్రీతితో తనభార్యతో మాటలాడుచుండుటయుగలదు—అతని యాత్మహత్యకు గారణమేమి?

మెహతాకు వార్తాపత్రికయందలి యితరవిషయములను జదువుటకు మనస్కరింపలేదు—అతడు దానిని విషాదముతోను, ఆతురతతోను బ్రక్కనబారవేసినాడు—కొంతసేపటికి కారు—పార్కులేనులోనున్న భవనమునొద్దకు బోయినది.

మెహతా కారునుండిదిగి హాలులో బ్రవేశించుసరికి కొంచెము సన్నముగను, పొడవుగను ఉన్నయువకుండు—(లేక బాలుడు) మందస్మిత సుందరవదనారవిందముతో నెదురుగాచనుదెంచినాడు—అతడే కృష్ణచందు మెహతా!—ఖుదీరామ్ మెహతాకుమారుడు సర్వవిధముల దండ్రినిబోలినవాడు—ఆ బాలుడు తనతండ్రితోగూడ మెట్లనెక్కి మేడమీది గదికేగినాడు—

"బాబా! నీవు భోజనసమయమునకు సరిగానచ్చితివి. నీరాక

కొరకు నేనెదురుసూచుచున్నాను...'' అని కుమారుడు తండ్రితో ననెను—ఇరువురును గదిలోనున్నట్టుబల్లనానుకొని రెండుకుర్చీలలో గూరుచుండిరి. మరికొంతసేపటికి మెల్లగను గోహార్ ఆ ప్రదేశమునకువచ్చినది—ఆమెవారికి దూరముగనున్న యొకబల్లయొద్ద గూరుచున్నది. ఎందుచేతనో యామెకన్నులు, కాంతిరహితములై యున్నవి ముఖము వివర్ణమై, విషాదమేఘములకు నిలయమైయున్నది. కాని, కృష్ణచందుమెహతాయును—ఖుదీరామ్‌మెహతాయును—తండ్రికొడుకులవలెగాక—మిత్రులవలె మిక్కిలి చనవుతోను—స్నేహముతోను—సంతోషముతోను ప్రసంగించుకొను చుండిరి — వారిచర్యలామెకు మధ్యమధ్య నానందమును కలిగించుచున్నవి.

"గోహార్! నీవొంటిగా నక్కడ కూరుచుంటివేమి? రమ్ము... ఆఁ—చెప్పమరచితిని—నీవు వార్తాపత్రికను జూచితివా? అని ఖుదీరామ్‌మెహతా ఆమెను బ్రశ్నించినాడు—

"లేదు—"అని గోహార్ హీనస్వరముతో బ్రత్యుత్తరమిచ్చినది.

"పాపము! రమేశచంద్రబాబు—పిస్తోలుతో గాల్చుకొనిఆత్మహత్య చేసికొన్నాడట—అతనిప్రక్క నొకయువతిచేత వ్రాయబడిన లేఖమాత్ర మున్నదట! .........అని ఖుదీరామ్‌మెహతా యింకను ఏమేమో చెప్పబోవుచుండెను —

ఆఁ—ఆఁ రమేశచంద్రబాబు—పిస్తోలుతో—కాల్చుకొని—ఆత్మహత్య చేసికొనెనా?" అని గోహార్ మహోద్రేకముతో బ్రశ్నించినది. ఆమె యుద్రేకమును గురుతించి, మెహతా చటాలున దనకుర్చీనుండిలేచి యామెయొద్దకు రా బ్రయత్నించుచుండెను. కాని యంతలోనే ఆమె స్పృహదప్పి, కుర్చీనుండి నేల కొరగినది.

# ఏ డ వ ప్ర క ర ణ ము.



రాత్రి పదిగంటలయినది!

ఖుదీరామ్ మెహతా—హాలులో నిటునటుపచారుచేయుచున్నాడు—అతనిలో శాంతములేదు—ముఖమునను శోషము లేదు—వ్యాకులపాటధికముగా నున్నది— కృష్ణచంద్ర మెహతా నిద్రింపబోయినాడు. స్పృహదప్పిపడియున్న గోహారును...........గృహమందున్న చెలికత్తెవచ్చి వేరొకగదిలోనికి దీసికొనిపోయినది. అక్కడనామె కుపచారములు సల్పినది. కొన్నినిముషములలోనే, గోహార్ స్పృహకు వచ్చినది. కాని యామెదనభర్తనుజూచుటకు గాని, అతనితో మాటలాడుటకుగాని, అంగీకరించుటలేదు— గదితలుపు మూయబడియే యున్నది

ఖుదీరామ్ మెహతా గదికీవల నిలువబడియున్నాడు—గదిలోను ధ్వస్య గర్భనిర్భేకముగా వినబడుచున్న తనభార్యయొక్క అసందిగ్ధ—అసందర్భాలాపముల నాలకించినాడు. తోడనే అతని హృదయములో లెక్కకు మిక్కిలియయిన యాలోచనము లుదయించినవి—తానుజెప్పిన యావార్త నాలించుటతోనే ఆమెముఖము నందంతటిభయోద్రేకమేలగలుగ వలయును? ఆమె యేదులకు స్పృహదప్పి పడవలయును-అయ్యరుపురకును గలసంబంధ మెట్టిది? ఆయువకుండు—మూర్ఖుడు-ఆత్మహత్య గావించుకొనినాడు—తరచుగా దనభవనమునకువచ్చియామెయెడల వింతవింతభావములను, వింతచూపులను వెలిబుచ్చుచుండెడివాడు—అంతమాత్రమున నాతనికిని ఆమెకు సంబంధమేమున్నది? ... ........ఏసంబంధములేనయెడల నామెయాతని హత్యావిషయమాలకించుటతోనే, మొదలునరికిన తరువువలె నేల కెందుకు కొరగినది?

సేవచేరినపిమ్మటగూడ దన్ను జూచుటకెందులకు అంగీకరింపకున్నది? ఒకవేళ నాతనియాత్మహత్యనుగుఱించిన రహస్యమామెకు దెలియునా? అని యాతడిట్లు పరిపరివిధముల నాలోచింపసాగెను. ఆతనిహృదయములోయదార్థముమాత్రము స్ఫురణకువచ్చుటలేదు. అంతకంతకు వ్యాకుల మధికమగుచున్నది. ఆకారణముచేతను దనభార్యకావిధ గు మనోవ్యాధిని గలుగజేయుటచేతను ఖుదీరామ్‌మెహాతా—ఆత్మహత్య గావించుకొన్న యువకుని దూషించినాడు! ఆతనిలో నొకక్రొత్తసందేహముదయించినది. 'రమేశచంద్రుడు గోహారును ప్రేమించుచున్నాడా?............అగును. ఐయుండవచ్చును......ఆతడు ప్రణయలేఖల నామెకు వ్రాసియుండవచ్చును......ఆమె యంగీకరింపకపోవచ్చును. ఆకారణముచేత నాతుచ్ఛుడు ఆత్మహత్య గావించుకొనియుండవచ్చును—' అని యాతడనుకొనినాడు—అనుకొనుటమాత్రమేకాదు. చివరకు యదార్థమని విశ్వసించినాడు— గోహారుయొక్క అంష్ఠ కమితముగా విచారించినాడు— ఆమెతన్ను జూచుటకు నిరాకరించియుండక, తన్ను బిలిచి, తనలో సత్యము వచించియుండవలసినదని తలంచినాడు—కాని ఆమె యట్లులెందులకు చేయవలయును? తనవిశ్వాసమామే చూరగొనలేదు—ఆమె విశ్వాసమును దాను చూఱగొనలేదుకదా?

కొన్ని నిముషములలో గదితలుపును దెరచుకొని, చెలికత్తెయావలకు వచ్చినది—

"బాబూ! అమ్మగారు—మిమ్ములను రావచ్చునని చెప్పిరి" అన్నదామె! ఆమాట ఖుదీరామ్‌మెహాతా కించుకమనశ్శాంతిని గలుగజేసినది. ఆతడు తలమీది బరువుకొంచెము తీసివేయబడినట్లొక నిట్టూర్పుబుచ్చినాడు— గదితలుపుం దెరచుకొని లోనబ్రవేశించి మరల దలుపునుమూసినాడు—అప్పటికి గోహారుమంచమునకు మధ్యగాలేచి

కూరుచుండియున్నది. ఆమెముఖము వివర్ణతను దాల్చియేయున్నది. అందు విషాదము ఘనీభవించియున్నది—

ఖుదీరామ్ మెహతా ఆమెకెదురుగా నించుకంతదూరములోనట గలయొక కుర్చీని లాగుకొని అందుకూలబడినాడు—అతఁడు తనపెదవులమీఁద లేనిచిరునవ్వును దెచ్చిపెట్టుకొనినాఁడు—

"ప్రియసీ! గోహార్! పాపము! నీకమితవిచారమును గలిగించువార్తను జెప్పితిని—" అని యాతడనెను—ఆమె కన్నులనుండియింతింతనరాని భయముట్టిపడుచుండ నాతనిముఖమును జూచుచున్నది. మరల మెహతా యిట్లునుడివెను—

"అతని యాత్మహత్య నీకింత బాధాకరమగుటకు గల కారణమేమనినేను పరిపరివిధముల నాలోచింప నారంభించితిని—కాని తుదకొక్క విశ్వాసము మాత్రము తోచుచున్నది........."

అట్లయినయెడల మీరు.........?" అనియామెయేమేమో అనబోయినది. కాని యామెగొంతుకనుండి మాట వెలువడలేదు. ఆమెభయమాతిశయించినది—

ఖుదీరామ్ మెహతా తలయూచుచు నామెకు దగ్గరగాబోయి యామెచేతిని బట్టుకొని—

"రమేశచంద్రబాబు—నీయెడల బరమనీమనివెలె బవర్తించినాడు. ఏమందు? నీవుమాత్రము స్థైర్యమునువిడనాడక—వానికోరికనుదిరస్కరించితివి."

అనినాడు—అతడు లేనియుత్సాహమును దెచ్చిపెట్టుకొనినాడు—

"గోహార్! అతఁడునిన్ను బ్రేమించినాడు. అంతేకాదు—నీయెడనప్రేమ నెరిగించుచు దుచ్ఛములైనలేఖలను వ్రాసినాడు ఆప్రణయలేఖలను జూచినీవు చలింపలేదు—మీదుమిక్కిలి వానికి బ్రత్యుత్తరములుకూడ నీయలేదఁయే నానమ్మకము—అతని కోరికను మన్నింపనియెడల

నీమూలమున వాడు ఆత్యహత్య గావించుకొందుననికూడా నాదుర్మా ర్గుడు చెప్పి, బెదరించియుండవచ్చును............తుదకట్లజరిగినది. కానిమ్ము—నీవు భయపడవలసిన అవసరము లేదు—విచారమొందవల సినఅగత్యములేదు—అతని మరణమునకు నీవెంతమాత్రమును బాధ్యు రాలవుగావు—"అనుమాటలాతడుచ్చరించినాడు—ఎందుచేతనో— గోహారునకుద్రేకమడంగినదికాదు. "మీరు యదార్థముగ్రహింపలేదు మీరు చెప్పినదిసరికాదు" అనుమాటలప్రయత్నముగా నామెనోటి నుండి వెలువడినవి ఆమె కెవ్వుమని కేకవేసినది. వర్ణనాతీతమగు భ యముచేత కంపించినది— అతడు రెండుచేతులతో నామెచేతులను బట్టుకొనినాడు—

"గోహార్! అట్లనవలదు నాయూహసరియయినదే! నేనుచెప్పిన దంతయు యదార్థమే! ఆతుచ్ఛుడు నిన్ను ప్రేమించినాడు—అతనిచ ర్యను నేనప్పుడే కనిపెట్టితిని. కాని నీవునీరహస్యమును నామోల బయటబెట్టలేదు. కించిత్తు నాకెరిగించియున్నయెడల నేనప్పుడే వానిని మెడమీద జేయివేసి గెంటియుండెడివాడను—" అని ఖుదీరామ్‌మోహ తాయింకను ఏమేమో చెప్పబోవుచుండెను. ఆమె—చేతితోవా రించినది—

"మీరువినుడు—నామాట నాలకింపుడు—మీరూహించి నది నిజముకాదు—రమేశచంద్రబాబునకును నాకునుగల సంబంధము ను మీకెరిగింపవలసియున్నది." అనియామె అన్నది. కాని యామెకం ఠమప్పట్ల మహోద్రిక్తముగను, పోల్చుటకు వీలులేకుండగను ఉన్నది. ఆమెముఖమున భయవిషాదములు ప్రతిఫలించుచున్నవి. కలలోనయిన ఖుదీరామ్‌మోహతా తలంపని రహస్యము—గర్భనిర్భేదకమగు రహ స్యము—ఆముఖమున గోచరించుచున్నది ఖుదీరామ్‌మోహతా ఆమె ముఖలక్షణములకు విస్మితుడాయెను—అప్పట్లనాతని హృదయమండలి

వివిధభాగములను దెలిసికొనుట కేకిశక్యము

"మీరు—ఒకసంవత్సరమునకుపూర్వము కళ్యాణపూర్ వెళ్ళి యుండిరిగదా!"........అని గోహరన్నది. అగును—ఖుదీరామ్ మెహతా యొకసంవత్సరమునకుపూర్వము గులాబ్‌తో గళ్యాణపురము లో రెండుమూడు రాత్రులు గడపినాడు. ఆతడు జ్ఞప్తికి దెచ్చుకొన్నాడు—

"ఆనాటిరాత్రి—నేను—రమేశచంద్రుని మేడమీదికి పోయితిని—ఆతని పడకటింటిలో—ఆతనిభార్యనలె బ్రవర్తించితిని—ఆమరునాడుకూడ—"గోహరుతనమాటలను ముగింపలేదు. అప్రయత్నముగ నామె భుజముల నానుకొనియున్న ఖుదీరామ్‌మెహతాయొక్క చేతులు క్రిందకు వ్రాలినవి. ఆతడు క్షణకాలము మాటలాడలేదు దీర్ఘమగు నిట్టూర్పునుబుచ్చి—

"గోహార్? నీమతిచెలించియుండవచ్చును—నీమెదడు స్వస్థస్థితిలోలేదు— నీవుచెప్పినది యదార్థముగాదు—అట్లెన్నటికిని జరిగి యుండదు—"

"అట్లుకాదు—వినుడు—నామాటను బూర్తిగావినుడు— మధ్యనడ్డుతగులకుడు—నామాటచలించినమాట వాస్తవమే! కానినేను చెప్పినదియదార్థము—"—ఆమె మరల క్షణకాలమాగినది. యదార్థమునాతని కెఱిగించుటకామె కుతూహలపడుచున్నది— ఆమె నిరాశను, నిరుత్సాహమును అనుభవించుచున్నను, మొండిధైర్యమును దెచ్చిపెట్టుకొన్నది—తప్పక, జరిగినదంతయు జెప్పితీరవలయునవియేయామె యభిలాషము!

"నేను............నేను రమేశచంద్రుని ప్రేమింపలేదు. ఆతనిపొందననుభవింపవలయునని నాకెన్నటికినిలేదు........ఉండదు నన్ను పూర్తిగా చెప్పనిమ్ము......మీరు ప్రశ్నలువేయకుడు—నేను

ఒకరోజుకాదు—రెండురోజులుకాదు! అయిదుసంవత్సరము లేకాకిసై జీవితము గడపితిని—మిమ్ములను గాఢముగా ప్రేమించితిని. నాప్రేమ కుప్రతిఫలము మీనుండినాకు లభింపలేదు—మీరు నన్ను ప్రేమింప లేదు—నన్ను గౌరవించిరి—మన్నించితిరి—నాకు లోపము సంతయు యినలేకుండ జేసితిరి—కాని యేమిలాభము?

ఒకపూటయయిన దుదకొక గంటయయినమీరు నాతో వినో దముగ కాలము గడుపలేదు—నేనొక స్త్రీనన్నవిషయమే మీరెరు గరు! నేనేమిచేయుగలను ఎన్నిదినము లొంటరిగా నిరుత్సాహముతో ను—నిరాశతోను జీవితము గడుపగలను?..........రమేశచంద్రుడు నన్నుగాఢముగ ప్రేమించినాడు—మీలోనేను కనుగొనలేనిప్రేమను, నేనాతనిలో గనుగొంటిని—ఆతడు తన యభిప్రాయమును దొలుత నామోముల వినిపించినాడు నేను మొదటలో నంగీకరించ లేదు—ఆగ్ర హమందితిని—ఆతడు నాపై గినియలేదు— వెనుకంజవేసి మిన్నకుం డలేదు. ఆనాటిరాత్రి నన్నుదన బాహువులమధ్యనదిమిపట్టినాడు. నేనే మిచేయగలను? మీరు నాహృదయఫలకమందుండినాస్థితిలో నాకస్మికముగా బొడగట్టితిరి మీరు నన్నొంటరిగ విడిచిపుచ్చి యదేసమయమున, అదేవిధముగా వేరొకయువతిని బాహువులలో........."ఆమెతన మాటను ముగింపలేదు. ఆతడదరిపడినాడు. ఆమెగ్రహించినది.

"అయ్యో! మీరదరిపడనక్కరలేదు—మీరునన్ను అన్యాయ ముచేసి, వేరొక స్త్రీ పొందనుభవించుచున్నారని నేననుకొనుటలేదు. ఆమాటను నేనునమ్మను—మీరు నాయెడల మాయను బ్రకటింపరు కాని నేనేమిచేయగలను? ఒంటరిగనుండి జీవితముగడపుటవలన నిరాశా నిరుత్సాహము లధికము లయినవి—అనాటియుదయమున— అనగా నేటికొక వత్సరమునకు పూర్వము రమేశచంద్రుడు నన్నుదనయింటికి డిన్నరు"నకు రావలసినదని పిలిచినాడు. నేనంగీకరించితిని—మేమిరువు

రము సినీమాకు వెళ్ళితిమి—తిరిగి వచ్చినపిమ్మట—నేనాతనిగదిలో-
ఆతనిపరిక్క............ ..ఆమరునాడుగూడబోయి అట్లేగడపితిని
వినడు—నామాటలను నమ్ముము. నేను తరువాతగృహమునకు దిరిగి
వచ్చితిని. కామోద్రేకమువలన నేనొనరించిన తప్పును నేనెఱింగితి
ని—సిగ్గుపడితిని—దుఃఖించితిని—బాధపడితిని—కాని రమేశచంద్రు
డు నన్ను విడువలేదు—వానిప్రేమతోబాటు మోహముగూడ ద్విగుణీ
కృతమయినది—ఆతడు మరునాటి యుదయమున టెలిఫోనులో నన్ను
దనమేడమీదికి రమ్మని పిలిచినాడు. నాకసహ్యమనిపించినది—నేను
ప్రత్యుత్తరముగూడ నీయక యిన్నకుంటిని—తరువాత నాకాతడొక
ఉత్తరమువ్రాసినాడు అదినాకు జెప్పుకలవికానంతకోపమును గలిగిం
చినది—ఆతడు—తానిప్పుడు కావించిన పనిని జేయుదునని నాకాయు
త్తరములో వ్రాసినాడు—నేనదానిని కోపముతో ముక్కముక్కలు
గావించి మంటలోబడవేసి తగులబెట్టితిని—ఆతడప్పుడు వ్రాసినట్లు
ఇప్పుడు చేసినాడు—ఆపిస్తోలును నాచేతులతో నేను వానికంఠమునకు
గురిచేసినట్లు భావించుచున్నాను."

గోహారుతనమాటలను ముగించినతోడనే, చంటిబిడ్డవలె దుః
ఖింపనారంభించినది. ఆమె యాసమయమున ననుభవించు హృదయా
వేదన యిట్టిదనిచెప్పుట కెవరికిశక్యము! ఖుదీరామ్ మెహతా నోటమాట
లేదు—ఆతడు శిలాప్రతిమవలె నిశ్చేష్టుడైయుండెను.

కొన్నినిముషములట్లు గడచినవి. గోహారు తనభర్తయొక్క చే
తులను రెంటిని బట్టుకొని—"మీరునన్ను త్యజింతురా! నేనుమీ
క్షమకు పాత్రురాలనుగానా నేనొనరించినదిదోషము మహాపాతకము
నేనెఱుగుదును. కాని యేమిచేయగలను మిమ్ములనతి దారుణముగా
ప్రేమించితిని. అందులకు ఫలితమే యిది మీరునన్ను క్షమింపరా?"
అని యతిదీనముగ బ్రార్థించుచు వెక్కివెక్కి యేడ్వనారంభించెను.

అప్పుడు ఖుదీరామ్ మెహతా యేమిచేయగలడు? ఆతడు క్షణకాలము దీర్ఘముగ నాలోచించినాడు.—

"గోహర్! నిన్ను క్షమించితిని—నేను నిన్ను త్యజింపను—నీవు దుఃఖింపవలదు"

ఆమాటలామె కాశ్చర్యమును గలిగించినవి. తానొనరించినది గొప్పతప్పు! తనజీవితకాలములో నాతడు తన్ను క్షమింపడనియు దనగతి యధోగతియనియు నామెయుద్దేశము! అట్టియెడ నాతని నోటినుండి యెన్నడు ననుకొనని వాక్యములు వెలువడినవి! ఆమె తొలుత వాని యందలి సత్యమును గురుతింపలేకపోయినది. స్తంభించినట్లు క్షణకాలమూరకున్నది.

"ఏమి? నాథా! మీరు నన్ను నిజముగా క్షమించితిరా? నేను మీయిల్లు విడిచిపోనక్కరలేదా?"

"అక్కరలేదు—నేను నిన్ను హృదయపూర్వకముగా క్షమించితిని."

ఆమె తన రెండుచేతులతో నాతనిదగ్గరకు దీసికొన్నది. తనభావోద్రేకమును వెలిబుచ్చినది. ఆతడు మాటలాడలేదు—ఆమె ప్రయత్నమును నిరోధింపలేదు. కాని యాతనిహృదయమతి తీవ్రముగ పని చేయుచున్నది. అందొకమూల గులాబ్! తన్ను మానవునిగా చేసితన మహోన్నతస్థితికి గారణభూతురాలైన గులాబ్ వేరొకమూల దననుండి క్షమార్పణమును వేడుకొనుచున్న తనభార్య!

గోహరు హీనస్వరమున దనభర్తనవలోకించి యిట్లన్నది. "నాథా! ఆయుత్తరములలో నొకటి పోలీసువారికి చిక్కినదిగదా! కర్తవ్యమేమి?" అని ప్రశ్నించినది—ఆమెకు ఆత్మహత్యగావించుకొన్న రమేశచంద్రుడు వ్రాసినలేఖలలోనొకటి వారికి జిక్కినది. అది వెల్లడిలోనికివచ్చినయెడల ముప్పుతప్పదని యామె భయము!

'గోహార్! నీవూరకుండుము. నీకేవిధమయిన భయమును వలదు. నేనాయుత్తరము బయటకు రాకుండ జేసెదను లెమ్ము. నీవు మనోవ్యాకులత నుడుగుము" అని ఖుదీరామ్ మొహతా తనభార్యను శాంతింపజేసినాడు. ఆమాటలు ఆలకించినంతనే ఆమె మగని ఔదార్యము వేయివిధముల గొనియాడినది కానియంతలో నామె మిన్నకుండలేదు.

"హృదయేశ్వరా! మీరు నన్ను ప్రేమించుచున్నారా? మీ ప్రేమ నాకవసరము" అన్నది, ఆహా! స్త్రీ హృదయమెట్లున్నది! ఆమెగయ్యాళిగం ! స్వార్థచిత్త! తనదోషమును మన్నింపుమని యడుగుట చాలదా? తన్ను ప్రేమింపుమని కూడ గోరుచున్నది! ఖుదీరామ్ మొహతా పరిస్థితి నేమి చెప్పగలను! ఆతడు గోహారుయొక్క దురవస్థకమితముగా జాలి పడుచున్నాడు!

---

## ఎనిమిదవ ప్రకరణము.

---

మరునాటిసాయంకాలము—తేనీరును సిద్ధపరచుకొని త్రాగిన పిమ్మట గులాబ్ ఫోనులో—ఆఫీసునందు పని చేసికొనుచున్న ఖుదీరామ్ మొహతాను బిలిచినది.

"ఖుదీ! రాత్రిభోజనమునకు నీవిక్కడకు వచ్చెదవా?"

ఆతడా యాహ్వానమున కులికిపడినాడు. పదినిముషముల వరకు మాటలాడలేదు—తరువాత, వేదనాభరమగు కంఠముతో—

“గులాబ్! నన్ను క్షమింపుము—రాజాలను—” అని ప్రత్యుత్తరమిచ్చినాడు. ఆపలుకులనాలకించుటతోనే, గులాబునకు మతిపోయినట్లయినది. ఆతడు— ఆవిధముగా బ్రత్యుత్తరమిచ్చుటకు గారణమేమి? ఆశనికంతముపూర్తిగా మాసిపోయున్నది—అందుత్సాహము పొడసూపుటలేదు—ఈవిధముగా నామె తలంచుచు—వికలచిత్తయై తన గదిలో నిటునటు పచారుచేయుచున్నది.

ఆసమయమున నామె మెదడులో బొడసూపిన యూహలకును-ఆలోచనలకును లెక్కలేదు. ఖుదీరామ్‌మెహతా తన్ను గాఢముగ బ్రేమించినాడుగదా! ఆతనిలో నీవింతమార్పుల నుదయింపవలయును? ఇది యేయామె విచారము.

ఆమె యెప్పటియట్లు బూర్క్‌స్ట్రీటులోనున్న విక్టోరియాహోటలునకు బయనమయినది. సాధారణముగా నప్పుడప్పుడాతని నాహోటలులో గలిసికొనుట నలవాటామెకున్నది. అందుచేతనాతనిం జూచి, తీరికగా నొకపర్యాయమాతనితో మాటలాడినయెడల తనమనోవ్యాధి యడంగునని యామె తలంపు!

విక్టోరియాహోటలులోని ముంగలిహాలులోనే యొకప్రక్కగా గులాబ్ కుర్చీలోగూరుచున్నది. వెయిటరామెయొద్దకు వచ్చినాడు. కాని యేపదార్థము దీసికొనిరమ్మని వానికి జెప్పవలయునో ఆమెకు తెలియదు—అయిదునిముషముల కాలమాలోచించినపిమ్మట “లెమన్ క్రష్” అని వానితో జెప్పినది. వెయిటరొకగ్లాసుతో క్రష్ తీసికొని వచ్చి బల్లమీదపెట్టి వెళ్ళిపోయినాడు. తరువాత నామెగ్లాసును పెదవిదగ్గర పెట్టుకొని కొంచెముకొంచెముగా త్రాగుచు ద్వారముదెస దనదృక్కులను బరపుచున్నది.

కొంతసేపటికి ముగ్గురువ్యక్తులులోప్రవేశించి యొకమేజాబల్ల చుట్టును గూరుచుండిరి. వారెవ్వరో కారు! ఖుదీరామ్‌మెహతా—ఆత

నికుమారుడగు కృష్ణచంద్రమెహతా!—ఆతనిభార్యయగు గోహార్! .........గోహారును జూచుటతోనే గులాబదిరిపడినది! ఆయదురు పాటునకు గారణములేకపోలేదు. ఖుదీరామ్‌మెహతా తానాహోటలు నకు వచ్చినని యెరుంగునుగదా! తన్నక్కడ గలిసికొనుమనుగదా! అప్పుడదన భార్యనెందులకు దీసికొనిరావలయును? తనకు జూపించుటకా? లేక, తనయెడల నాతడు మాయనుబన్నుచున్నాడా? .........ఇట్లాలోచించుచునామె తదేకధ్యానముతోదన కృష్ణులను గోహారుముఖమువైపునకి బ్రసరింప జేసినది. అప్పట్ల గోహారును ఖను విషాదమే ఘావృతమయ్యు సుందరముగనే యున్నదని ఆమె గ్రహించినది.

ఖుదీరామ్‌మెహతా వెయిటరును బిలుచుచు వెనుకకుదిరిగిచూచినాడు! తోడనే గులాబ్ నాని కన్నులకు గన్పట్టినది!

"గులాబ్! వచ్చితివా?" అనిచెప్పుచు నాతనుతటాలునందానున్న స్థలమును విడిచివచ్చి యామెయొద్దకు వచ్చినాడు—ఆతని చర్య గులాబునకు వింతగానున్నది.

"ఖుదీ! నీభార్యయక్కడ........." అని యామెయేదో చెప్పబోవుచున్నది. కాని యామాటలనాతడు వినిపించుకొనకుండగానే "గులాబ్! నీవుకూడ మాటేబిలునొద్దకురమ్ము—గోహారును నీకెరుకపరతును" అనెను. ఆమాట గులాబునకు బాకుపోటు గాకుందునా? కాని యామెయేమనగలదు? మెల్లగాలేచి యాతనిననుసరించినది.

"గోహార్! ఈమెమిస్. గులాబ్ నాస్నేహితురాలు" అని మెహతాగులాబును దనభార్యకెరుకపరచినాడు.

"మిస్. గులాబ్! మీపరిచయభాగ్యము నాకునసంతోషమును గలిగించుచున్నది. రండు—ఈ టేబిలాకూరుచుండుడు... ........

అని పలుకుచు గోహారు—ఒకకుర్చీని గులాబునకిచ్చినది. గులాబ్ అందు లోనుపవిష్టురాలాయెను.

"మిస్. గులాబ్! నాభర్త—తనకు మీవంటి స్నేహితురాండ్రున్నట్లు నాకెప్పుడును చెప్పలేదు—మీకిరువురకు నెంత కాలమునుండి పరిచయము?"

"మనయిరువురి వివాహమునకుఁ బూర్వమునుండియు, మాకిరువురకు పరిచయముగలదు"—అని ఖుదీరామ్ మెహతా యదార్థముగ నుడివెను. కాని యామాటలకు గోహారునకు కనుమానముగాఁ సందేహముగాని కలుగలేదు.

'ఓహో! అలాగునా? అటులయిన చిన్నదినముల నుండియు మిమ్ములనొక పర్యాయమయిన మాయాతిథ్యమును స్వీకరించుటకు బిలువకుండుట మాయపరాధమే' అని గోహారన్నది.

"గోహార్! నాకు మీయింటికి వచ్చుటకెక్కడ కుదురును నేను మీనుండి కొన్ని వేళ్ళదూరములో నివసించుచున్నాను ......మీకుమారుడు మిక్కిలి చురుకయినవానివలె గన్పట్టుచున్నాడే! ఇట్టిపుత్రుని బేరు ప్రఖ్యాతులార్జించి భర్తనుబడయ గల్గుట మీపుణ్యమేగదా!

"అగును-నిజముగా నేను అందులకు గర్వించుచుందును-నాభర్తను జూచి నేనుముఱిసి పడుచుందును. వివాహమయినప్పటినుండె నేనిప్పుడు నాభర్తను గాఢముగ బ్రేమించుచున్నాను. ఆయన శాసనసభలలో బ్రవేశించి—ప్రజోపయోగములగు కృత్యముల నెన్నిటినో చేసినారు-నిరుద్యోగసమస్యను బరిష్కరించి, అన్నవస్త్రములులేక, మలమలమాడుచున్న యువకులకు ఉపాధిగల్పించినారు. ప్రభుత్వమువారి మన్ననలకు పాత్రులై "సర్" బిరుదమును పొందినారు—మీరెరుగుదురా?" అని గోహారు ప్రశ్నించినది.

గులాబు సమాధానమీయలేదు-తలనూపుచు నామెమాటలను

విన్నది. ప్రాయికంబుగ. స్త్రీపాతుకుడొక్కడు—ఫలము ననుభవించువాడొకండు?''—అనునట్లు తనభార్య—చేసిన దేమియు లేకున్నను దన్ను గురించి, మహాఘనముగా జెప్పుకొనుచున్నదికదా యని మెహతా అచ్చెరువందసాగెను.

ఇట్లు వివిధవిషయములను గురించి, గులాబ్ గోహారు లిరువురు నుగొంతసేపు ముచ్చటించిరి—ఆమె భాషణ సారాంశము గులాబునకు వేదనాకరమనియే చెప్పవలయును. ఆమెయేదో యొక నెపమును గల్పించుకొని, మెహతాయొద్దను, గోహారుకొద్దను సెలవుబుచ్చుకొని తన మేడమీదికి పోయినది. దారిపొడుగునను ఆమెహృదయము పరస్పర విరుద్ధములగు నాలోచనలతో మునిగిపోయినది ఆనాటి నాటకమున కర్థమేమి? మెహతా తనభార్యతో దానుసుఖముగ జీవితముంగడపుచున్నాననియు నికదనయవసరమక్కర లేదనియు జూపించుటకట్లు చేసినాడా?......ఈవిధముగా నాలోచించినది. మొత్తముమీద నామె హృదయములో సంచలన ముదయించినదని చెప్పకతప్పదు?

---

## తొమ్మిదవ ప్రకరణము.



గులాబ్‌యొక్క హృదయమునందింతితనరాని వ్యాకులభావ ముదయించినది. ఖుదీరామ్ మెహతా ఆమెయొద్దకు మరునాటి సాయంకాలమున వచ్చినాడు—

"ఖుదీ! నీవు నీభార్యను హోటలునకెందులకు దీసికొనివచ్చితివి? నాపరిచయమామె కెందులకుగలుగజేసితివి?'' అనియామె ప్రశ్నించినది. మెహతా కారణమును వచింపలేదు. కాని గతరాత్రి జరిగిన విషయములను—అనగా తనభార్యయొక్క చరిత్రమును దెలిపినాడు.

"ఘుదీ సీగార్య నిన్నంతగాఢముగా ప్రేమించుచున్నదికదా మీయిరువురి జీవితములమధ్యను వేనెందులకడ్డురావలయును నీవు నన్ను మరచిపోరాదా" అని ప్రశ్నించినది.

"ఏమి గులాబ్ ప్రేయసీ నిన్ను నేను మరచిపోవుటా నాశరీరములో ప్రాణములుండవలదా? ప్రాణములనయినను విడువగలనుగాని, నిన్ను విడువలేను—" అని సమాధానమిచ్చినాడు.

"నీవు పాశ్చాత్యదేశములకు బ్రయాణముచేయుట యేమయినది?"

"నిన్ను విడువజాలను—నీముఖమును జూడకుండ నేనుండలేను నేనాప్రయత్నమును విరమించుకొంటిని" అని పలుకుచు మెహతాయామెను బిగ్గరగా కౌగిలించుకొనినాడు. ఆతను కొంతసేపుతన ప్రియురాలితో సరససల్లాపములను గానిచ్చి వెడలిపోవుటకుద్యుక్తుడై యామెనవలోకించి—

'ప్రేయసీ గోహారింకొకగంటలో నిక్కడకు వచ్చుచున్నది సుమీ? నీలాడ్జిని జూడవలయుననిఆమె యుత్సాహపడుచున్నది" అనిచెప్పి ఆమెయొద్ద సెలవుపుచ్చుకొని వెళ్ళిపోయెను—ఆతడాఫీసునకుబోయి, అక్కడ బనిచూచుకొని స్వగృహమునకరిగి కారులో దనభార్యయగు గోహారును బంపినాడు—

గులాబ్ సగౌరవముగా గోహారును లోనికాహ్వానించి యొక కుర్చీమీద గూర్చుండజేసినది. తాను దేనీటిని సిద్ధముచేసుకొని తెచ్చుటకై లోనికరిగినది—ఆమెవచ్చులోపున గోహార్ ఆగదిలోనున్న వస్తువులపై దనదృక్కులం బరపినది. అందొకమూలనున్న మేజాబల్లమీద దనభర్తయగు మెహతాయొక్క ఫొటో యామెచూచినది. ఆమెమెదడులో లెక్కలేనన్ని సందేహములు బయలుదేరినవి. ఆఫొటో అక్కడనుండుటకు గారణమేమి? గులాబునకును దనభర్తకును ఇతరసంబంధములేమయిన నున్నవాయని ఆమె యనుమానింపసాగినది. తోడ

నే ఎదురుగానున్న బుక్ షెల్ఫ్‌లోని పుస్తకములనుదీసి పరిశీలింప నారంభించినది. అందొక పుస్తకమునిూద—

“నాహృదయేశ్వరి— నాప్రేమపాత్రి— నాగులాబునకు
ఖుదీరామె మెహతా”

అని వ్రాయబడియున్నది. దానింజూచుటతోనే ఆమె యొడలుఝల్లుమన్నది—కన్నులు గిఱ్ఱున దిరుగనారంభించినవి. ఆప్రదేశముననే జీవచ్ఛవమువలె నేలపై గూలినది. అంతలో గులాబొక గ్లాసుతో తేనీటిని బట్టుకొనివచ్చినది గోహారుచేతిలోనున్న పుస్తకమును ఆమె ముఖలక్షణాలను గ్రహించినది—ఆమెకాళ్ళు గడగడలాడినవి—

“గులాబ్ నన్ను మన్నింపుము—నీపాదములపై బడి నిన్ను నేనతిదీనముగ ప్రార్థించుచున్నాను. నాప్రశ్నకు సమాధానమిమ్ము—నీవు నాభర్తను ప్రేమించుచున్నావా? నాభర్త నిన్ను ప్రేమించినాడని నీవు నాకు నేరుగ జెప్పనక్కరలేదు.” అని ప్రశ్నించినది—గులాబిచ్చిన తేనీటిగ్లాసు నొకచోట బెట్టినది. గులాబున కేమిచెప్పుటకును దోచినదికాదు—ఏమి చెప్పగలదు?

గోహారు—కన్నీరుమున్నీరుగా గార్చుచు, నూపొందిన శోకదేవతవలె గన్పట్టుచు గులాబ్ పాదములపై బడి—

“అమ్మా! నాకు సెలవిమ్ము—నేను పోవుచున్నాను—నాఅంతిమప్రార్థనము నాలకింపుము—నేను నాభర్తను త్రికరణశుద్ధిగా ప్రేమించుచున్నాను ఆతడు నీమూలమున నన్నాదరించుటలేదు—దయయుంచి, నాకు బతిభిక్షబెట్టుము—నాభర్తయు నేను పాశ్చాత్య దేశమునకు ప్రభుత్వవారియాజ్ఞననుసరించి—పయనము చేయుచున్నాను. ఆతడు నాదైన్యమును గురుతించి, నాప్రార్థనమాలకించి తొలుత నాప్రయాణమునకంగీకరింపకున్నను ...................... ఇప్పుడంగీకరించినాడు. నేనిక్కడకు వచ్చుటకుముందే అతని నంగీకరింపజేసితిని. అతడిక్కడకు వచ్చినట్లు నేనుగ్రహించితిని—అతనినోటినుండి కూడ నిన్ను

గురించి వింటిని—నాభర్త నాకు నాస్వాధీనుడు కావలయును—లేకున్న నాప్రాణములుపోవును—నీవు—ఇదిగో గులాబ్ నాప్రార్థనము ఈక్షణమునుండి యింకెన్నడును నాభర్తనుజూడనని నాకు బాసచేయవలయును." అన్నది. గులాబ్—ఆమాటలకు విషణ్ణవదన యయినది—ఆశ్చర్యచకితయయినది—ఆమెలో క్షణకాలము నరకేష్వధమయినభావము గలుగలేదు. తరువాత నామెకు వాగ్దానమొసంగినది. గోహారు ఆత్మసంతృప్తితో గులాబును విడిచి వెళ్ళినది.



గులాబ్ జీవితము దుఃఖమయమయినది. ఆమె చేసిన మహత్తరత్యాగమే ఆమె జీవితము సద్గతి పాలొనరించినది ఆమె యిక ఖుదీరామ్ మెహతానుజూడగూడదు. అనగా నెవ్వనికొరకు దానిన్ని సత్సలములు సంఘస్థానమునకును, సౌఖ్యమునకును దూరస్థయయ్యి బ్రతుకుచున్నదో—అట్టిప్రియుని జూడగూడదు! ఎందుచేత గోహారునకామె వాగ్దానము చేసినది.

ఆవాగ్దానమును దాను నెరవేర్చుకొనవలయును.

తానింతవరకు అవ్యాజము—అకలంకమునగు ప్రేమకొరకు దన సర్వస్వమును ధారవోసినదిక నిప్పుడో సత్యవాక్పాలనముకొరకేమి చేయవలయును? ఆప్రశ్నయామె హృదయములో బ్రవేశించినది. తోడనే 'ప్రాణత్యాగము'ను సమాధాన మంతరాత్మయామె చెవిలో వినిపించినది.

సరి! గులాబ్—ఖుదీరామ్ మెహతా అర్పించిన వజ్రహారమునందలి నాల్గువజ్రములను—మ్రింగివేసినది! సమాప్తము! ఆవిధముగా నానిష్కళంకజ్యోతి నేలకూలినది. ఆపవిత్రమూర్తి యసువులంబాసినది.

అహో! ఏమి ప్రేమ? ఏమిత్యాగము! ప్రాణత్యాగమునకుగూడ ప్రియుని వజ్రహారమే కావలయునా?

సంపూర్ణము.

# శ్రీశుద్ధనిర్గుణతత్వ కందార్థములు

( తాత్పర్యసహితము )

పాఠకా!

హిందూమత మన్నివిషయములయందును వాసిగాంచినది. మనదేశము తత్వవేత్తలకుఁ బ్రసిద్ధిఁ జెందినదని ప్రాచీనచరిత్రలు చెప్పెడి మాట యటుంచుము. ఈనాఁడొక ఆంధ్రుడు పాశ్చాత్య దేశీయతత్వవేత్తలచే జోహారు లందుకొనుచున్నాడు. ఆముష్మికముపనిషత్తులభావ మెఱింగినవారికిఁ గరతలామలకము. ఈయుపనిషత్తులలో నుండి పిండితీసిన సారము సామాన్యజనులకు బోధపడునటుల నీతత్వములు వ్రాయఁబడినవి. గ్రంథకర్తయగు భాగవతుల కృష్ణదాసస్వామి వేదాంతలోకమునకు బరిచితుఁడే. నీ వొకసారి దీనిని చేతపట్టితివేని యమదూతలు నీవంక కన్నెత్తిచూడరు. ఉదాహరణమున కొకతత్వము నిచ్చితిమి చూడుము.

క. చచ్చుట పుట్టుట మొలకువ
వచ్చుట గాఢవుసుషుప్తి వచ్చుట యివినా
ల్గచ్చముగ సహజ మెఱుకకు
బొచ్చెము యీయెఱుకనిల్వఁ బోదుమయప్పా.

వెల 0—12—0.

శ్రీసత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# భట్టివిక్రమార్కునికథలు

గ్రంథకర్త:—మద్దూరి శ్రీరామమూర్తిగారు.

అపరిమితపరాక్రముండగు విక్రమార్కుని సుమారు 52 కథలిందు చెప్పబడినవి. కథమొదలిడినదాది చివరవరకును రసవంతముగాను శోభావంతముగాను నుండి విసువు పుట్టించక వీలైనంతవరకు వివాదములపాల్పడచేయక చదివినకొలది చదువ నాస గలిగించుచు సుమారు పదిరోజులకు గూడ తనివితీరకుండునట్లు చేయుపుస్తకము. అతిరమణీయమై ప్రయాణము చేయువారి కాలము వెళ్ళించుటకొకప్రతి చేతులలో నున్న ప్రయాణపువిసుగుండనేయుండదు. 250 పేజీలు రు.1—0—0

# శుకసప్తతికథలు

గ్రంథకర్త:—మద్దూరి శ్రీరామమూర్తిగారు.

పద్మావతియను స్త్రీ పరపురుషునితో రమింపబోవుచున్నపుడొకొక్కరాత్రి ఒకొక్కకథ చెప్పి యాప్రయత్నము నుండి మళ్ళింపజేసిన 80 కథలిందు గలవు. జగన్మోహిని, కామిని, విరూపాక్షుడు, సుముఖీదున్ముఖులు, శకుని, సుందరుడు, విక్రమసేనుడు, కాంతామతి, గుణనిధి, సాహిని, రుక్మరావు జగన్మోహినులు, శాంత, గర్గుడు, నరపాల సోమదత్తులు, అద్భుత ఫలము, మాయసన్యాసి, కుటిలుడు, ముత్యాలహారము, ఇందుముఖి, చంద్రవదన, మీనరాజు, శృంగారవతి, విక్రమార్కుడు, మన్మధుడు, దేవయాన, ప్రభావతి, మోహనాంగి మొదలగుకథలు కలవు. ప్రతికథ శృంగారరసపూరితమే. వెల 0—8—0

---

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.